LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail editor@zaminryot.com

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    సంపుటి : 71    సంచిక : 25    23.6.2000 శుక్రవారం    12 పేజీలు    విడిప్రతి : రూ.2.00లు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# ఎవరు చెప్పింది నిజం లెక్క?

కరెంట్ ఛార్జీల పెంపకం సమస్య రోజు రోజుకు తీవ్రరూపం దాలుస్తున్నది. రాష్ట్రంలో ఇప్పుడు ఇటు ప్రజలు అటు రాజకీయవాదులకు చర్చనీయాంశం ఇది ఒక్కటే. పత్రికలలో ప్రధాన వార్తలూ కరెంట్ గురించే. అయితే ప్రజాజీవితాన్ని ఇంతగా ప్రభావితం చేస్తున్న ఈ విషయంలో ఎవరూ నిజాలు చెప్పడం లేదు. ఒక్కొక్కరు ఒక్కొక్క లెక్క చెప్పి

## కరెంట్ ఛార్జీల పెంపకంలో ఒక్కొక్కరిదీ ఒక్కొక్క లెక్క!

ప్రజలను గందరగోళ పరుస్తున్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, ట్రాన్స్‌కో సంస్థ కలిసి చెప్తున్నవన్నీ అబద్ధాలే. కరెంట్ ఛార్జీల పెంపకం విషయం వార్తలలోకి ఎక్కినప్పటి నుంచి జరుగుతున్న పరిణామాలు గమనిస్తే ఇది సులభంగా అర్థమై పోతుంది.

చంద్రబాబు నాయుడు గారు మహా లౌకికుడు. 'ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో అప్పటికా మాటలాడి తప్పించుక తిరుగువాడు ధన్యుడన్న' సుమతి సూక్తి బట్టీ పట్టిన వాడు. గత ఐదారేళ్లుగా ఆయన కరెంట్ గురించి ఎన్ని రకాల వాదాలు వినిపించాడో లెక్క లేదు. ఒకసారి చెప్పింది మరొకసారి చెప్పక పోవడం ఆయన ప్రత్యేకత.

కరెంట్‌కు సంబంధించి ప్రజలు తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయి. ధరల పెంపుకు అనుసరించిన ప్రాతిపదిక, విద్యుత్ సంస్థ నష్టాలపాలు కావడానికి కారణాలు, పంపిణీ, సరఫరాలో వస్తున్న విద్యుత్ నష్టం, కరెంట్ దొంగతనం, రైతులు వాడుతున్న కరెంట్ పరిమాణం, బోర్డుకు వస్తున్న రాబడి వంటి విషయాలన్నీ ఆధారం చేసుకోగలిగితేనే ఎవరైనా ఛార్జీల పెంపకం పట్ల అనుకూలంగా కాని, ప్రతికూలంగా కాని మాట్లాడగలుగుతారు. కాని వీటి వేటికీ సంబంధించి కూడా ప్రభుత్వం నిజం చెప్పడం లేదు.

ప్రభుత్వం చెప్పే లెక్కలు, విద్యుత్ సంస్థ ఇంజనీర్లు చెప్తున్న లెక్కలు, కాంగ్రెస్ వంటి ప్రతిపక్షాలు ప్రచారం చేస్తున్న అంకెలకు పొంతనలేదు. దీంతోపాటు ఇరుగు పొరుగు రాష్ట్రాలలో విద్యుత్ ఛార్జీలపైన కూడా ప్రజలకు సరైన సమాచారం అందడం లేదు. ప్రభుత్వ అనుమతితో ట్రాన్స్‌కో ప్రతిపాదించిన కరెంట్ ఛార్జీల పెంపకం 808 కోట్లు; కాని రెగ్యులేటరీ అథారిటీ 1095 కోట్లు అదనపు రాబడి వచ్చే విధంగా ధరలు పెంచింది. ప్రభుత్వం అడిగిన దానికంటే ఎక్కువ వారు ఎందుకు పెంచారో మనకు తెలియదు. ఏ ప్రాతిపదికమీద ఈ పెంపకం నిర్ణయం తీసుకున్నారో వారు చెప్పడం లేదు. కాంగ్రెస్ నాయకులు వారి ఆఫీసు వెళ్లి

## 1994లో బోర్డుకు లాభం 800 కోట్లు; ఇప్పుడు 4 వేల కోట్ల నష్టం ఎందుకొచ్చింది?

అడిగినా సమాధానం చెప్పలేదు. రెగ్యులేటరీ అథారిటీ పెంచిన ధరలు తగ్గించే అధికారం తనకు లేదని పదే పదే చెప్తున్న ముఖ్యమంత్రి ప్రజలలో గలభా చెలరేగగానే కొంత మేరకు తగ్గిస్తున్నట్లు ప్రకటించారు. అది ప్రభుత్వ సబ్సిడీ అన్నది ఆయన వాదం.

అసలు ఈ ప్రభుత్వ సబ్సిడీ ఎంత, ఎందుకోసం ఇస్తున్నారు అన్న విషయం మాత్రం వివరించడం లేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారం ట్రాన్స్‌కో సంస్థకు ఏడాదికి దాదాపు నాలుగు వేల కోట్ల వరకు నష్టం వస్తున్నదట. 1994లో తెలుగుదేశం అధికారంలోకి వచ్చేటప్పటికి విద్యుత్ బోర్డు 800 కోట్ల రూపాయల లాభంతో నడుస్తున్నదని ట్రాన్స్‌కో ప్రచురించిన పుస్తకాల్లో వుంది. ఈ ఆరేళ్లలో ఆ లాభం అంతకు ఐదు రెట్ల నష్టంగా మారిపోవడానికి కారణం ఏమిటి?

ఇది వరకు నష్టాలకు కారణం రైతులకు చవక ధరలో కరెంట్ సరఫరా చేయడం అని చెప్పేవారు. కాని ఇప్పుడు ట్రాన్స్‌మిషన్‌లో విద్యుత్ నష్టాన్ని చూపిస్తున్నారు. అది దాదాపు 38శాతం వరకు వుందని చెప్తున్నారు. లైనులో అంత కరెంట్ లీక్ ఎట్లా అవుతుందని ప్రశ్నిస్తే, అందులో సగం దొంగతనం అని కొత్త వాదం వినిపిస్తున్నారు. కరెంట్ చౌర్యం ఎప్పుడో వున్నది. ఇప్పుడు దాన్ని గురించి కొత్తగా మాట్లాడవలసిన పని లేదు. రాష్ట్ర విద్యుత్ బోర్డుకు సుదీర్ఘంగా సమర్థవంతంగా పనిచేసిన నార్ల తాతారావు గారు ఎప్పుడో పదిహేనేళ్ల క్రితం దొంగ తనాలు నివారించడానికి ఎనర్జీ ఆడిట్ ప్రవేశపెట్టాలని, ట్రాన్స్‌ఫార్మర్లలో మీటర్లు బిగించి సంబంధిత లైన్‌మెన్లను బాధ్యులను చేయాలని సూచించారు. కాని ఇప్పటి వరకు ఆ సంగతి పట్టించు కున్నవారు లేరు.

ఇప్పుడు చంద్రబాబు కేవలం కరెంట్ దొంగతనం గురించి మాత్రమే మాట్లాడుతున్నారు. అందుకోసం ఒక కొత్త చట్టం కూడా తయారు చేశారు. కరెంట్ చోరీ చేస్తే జైలు శిక్ష విధిస్తామని చెప్తున్నారు. కాని దొంగతనానికి విద్యుత్ వుద్యోగులను బాధ్యులను చేయడం మాత్రం ఆయన ఆ చట్టంలో మర్చి పోయారు. కరెంట్

## కరెంట్ చోరీకి ఉద్యోగులు బాధ్యులు కారా?

చోరీ జరగడానికి స్థానిక లైన్‌మెన్లు కారణం. వారే వచ్చి తీగలు తగిలించి నెల నెలా మామూళ్లు దండుకొని పోతున్నారు. లైన్‌మెన్లకు తెలియకుండా ఎవరూ కరెంట్ వాడలేరు. శిక్ష వారికి పడితేనే దొంగతనాలు ఆగుతాయి.

కాని కేవలం కరెంట్ దొంగతనాల వల్ల విద్యుత్ సంస్థ దివాలా తీసే పరిస్థితి వస్తే ప్రభుత్వం ఇంతకాలం ఏమి చేస్తుండింది.

తరువాయి 7వ పేజీలో

# సహాయ నిరాకరణ సాధ్యమా?

విద్యుత్ సమస్యపై కాంగ్రెస్, కమ్యూనిస్టులు కలసి చేస్తున్న పోరాటం ప్రథమ దశ దిగ్విజయంగా ముగిసింది. కమ్యూనిస్టులు ప్రజలలోకి వచ్చి ఆందోళనలు జరిపి చాలా కాలమైంది. తెలుగుదేశంతో మిత్రత్వం వల్ల వారు కొన్ని సంవత్సరాలుగా ప్రజలకు దూరమైపోయారు. ఆ కొరత ఇప్పుడు తీరుతున్నది. కాంగ్రెస్‌కు సంబంధించి కూడా ఇది శుభపరిణామం. కొత్త పిసిసి అధ్యక్షుడు

## కాంగ్రెస్, కమ్యూనిస్టుల పోరాటంలో మొదటి దశ విజయవంతం

సత్యనారాయణ రావుకు పదవి చేపట్టగానే ప్రజలలోకి వెళ్లే అవకాశం కల్పించాడు చంద్రబాబు నాయుడు. ఈ వుద్యమం పట్ల జనం నుంచి ఎదురౌతున్న సహకారం వీరిని ప్రోత్సహిస్తున్నది.

నిరసన ప్రదర్శనలు, ధర్నాలకు పరిమితమై వుండిన ఆందోళన, విజయవాడ పోలీసుల దుండుకుతనం వల్ల కొత్త రూపం ధరించే అవకాశం కల్గింది. రాష్ట్ర సిపిఎం నేత నరిమణి పుణ్యవతి పోలీసుల లాఠీ దెబ్బలతో ఆస్పత్రిపాలయ్యిందన్న వార్త మొత్తం రాష్ట్రంలో కమ్యూనిస్టులను ఉద్రేకపర్చింది. ఆ నిప్పును ఎగదోయడానికి కాంగ్రెస్ ఏ మాత్రం సందేహించడం లేదు.

కరెంట్ ఛార్జీల పెంపకం ప్రభుత్వ దుర్మార్గమని ప్రజలకు నచ్చచెప్పడంలో వీరు సఫలీకృతులైనారు. కాని ముఖ్యమంత్రి మాత్రం ధరల తగ్గింపుకు సిద్ధపడడం లేదు. ఇప్పుడు వుద్యమం పరిస్థితి ఏమిటన్నది సమస్య. కేవలం వూరేగింపులు, ధర్నాలతో ఎంతోకాలం కొనసాగించడం కష్టం. ఇటువంటి కార్యక్రమాలు నిర్వహించడానికి కార్యకర్తలు కావాలి. రోజూ వారిని పని మానుకొని వీధులలో తిరగమంటే ఎట్లా?

రెండవ దశ వుద్యమాన్ని కేవలం ధర్నాలతో నడపడం వ్యర్థం. బిల్లులు కట్టవద్దని ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ, సహాయ నిరాకరణ ప్రారంభించాలని ఒక వర్గం కోరుతున్నది. అయితే ప్రజలు దీనికి స్పందిస్తారా అన్న సందేహం ప్రతిపక్ష నేతలలో వ్యక్తమౌతున్నది. కరెంట్ బిల్లు కట్టకుంటే సరఫరా డిస్‌కనెక్ట్ చేయడం ఖాయం. దాన్ని ప్రతిఘటించడానికి సాధారణ పౌరులకు సాహసం వుండదు; అట్లని కరెంట్ లేకుండా బ్రతకడం వూహించలేని విషయం. డిస్‌కనెక్షన్ కోసం వచ్చే విద్యుత్ సిబ్బందిని నిరోధించేందుకు రాజకీయ పార్టీలు తగిన మంది బలం సమీకరించి సాధారణ పౌరులకు అండగా నిలవాలి. అది గ్రామాలలో సాధ్యమౌతుంది కాని, పట్టణాల్లో అసాధ్యం. గ్రామాలలో అయితే, వూరి పొలిమేరల్లో కాపలా పెట్టి, సిబ్బందిని అడ్డగించవచ్చు. పట్టణాల్లో అది ఎట్లా వీలు అవుతుంది? సహాయ నిరాకరణ మొదలుపెట్టి, విఫలమైతే చంద్రబాబు చాలా సులభంగా వుద్యమాన్ని నీరు కార్పించేస్తారు. అటువంటి అవకాశం కోసమే ఎదురు

## కరెంటు బిల్లులు కట్టకుండా చేయడం సాధ్యపడుతుందా?

చూస్తున్నారు ఆయన.

***

కరెంట్ ఛార్జీల పెంపకం సహేతుకమని ప్రజలకు నచ్చచెప్పడం కోసం తలపెట్టిన గ్రామసభలను, చాలా తెలివిగా దొంగ కనెక్షను క్రమబద్ధీకరించడానికి అధికారులను గ్రామాలకు పంపే కార్యక్రమంగా మార్చి పారేశాడు ముఖ్యమంత్రి. ఛార్జీల విషయం మాట్లాడితే జనం చీపుర్లు తీసుకొని తరుముతారని అధికార్లు మొరపెట్టుకోవడంతో ఈ పన్నాగం పన్నారాయన. గ్రామాలలో ఇళ్లకు, మోటార్లకు కూడా కనెక్షన్ కోసం దరఖాస్తులు పెట్టుకొని, నెలల తరబడి ఎదురు చూడవల్సి వస్తుండడంతో, ఈ సభల ద్వారా సులభంగా కనెక్షన్ దొరుకుతుందని ఆశపెట్టి ప్రజలను సభలకు రప్పిస్తున్నారు. పొరపాటున కూడా వీటిలో పెరిగిన ధరల ప్రస్తావన తేవడం లేదు.

***

గ్రామ సభలకు తెలుగుదేశం ఎమ్మెల్యేలు, మంత్రులు తప్పకుండా హాజరు కావాలని ఆదేశించిన ముఖ్యమంత్రి తాను మాత్రం చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు. మెదక్, నిజామాబాద్ జిల్లాలలో ఎదురైన చేదు అనుభవాలతో ఆయన, తాను హాజరయ్యే గ్రామాలు తెలుగుదేశం స్థావరాలుగా వుండేలట్లు చూసుకుంటున్నారు. ప్రకాశం జిల్లాలో, మార్టూరు నియోజకవర్గంలోని రాజుపాలెం గ్రామం వెళ్లారు. అది తెలుగు వాసన గుభాళించే గ్రామం. 1982 తర్వాత జరిగిన ఏ ఎన్నికలోనూ కాంగ్రెస్ వంటి పార్టీలకు కనీసం ఒక్క ఓటు కూడా పడని వూరు. అంత కట్టుబాటుగా నిలిచే గ్రామాలలో చంద్రబాబు ఏమి మాట్లాడినా అడ్డు చెప్పేవారు ఎవరు వుంటారు చెప్పండి?"

## ఇంజనీరింగ్ ఫీజు లక్ష అట!

ఇంజనీరింగ్ కాలేజీల్లో పేమెంట్ సీట్ల ఫీజును భరించరానంత అధికం చేయబోతున్నాది రాష్ట్ర ప్రభుత్వం. ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీల ప్రలోభానికి లొంగిన ముఖ్యమంత్రి ఎన్నారై సీట్ల సంఖ్యను పెంచడంతోపాటు, ఆ కోటా క్రింద చేరే విద్యార్థులు చెల్లించవల్సిన ఫీజును లక్షా రెండు వేలకు పెంచడానికి సమ్మతించాడు. ఇప్పటి వరకు ఈ కోటా విద్యార్థులు ఏడాదికి అరవై వేల రూపాయల ఫీజు చెల్లిస్తున్నారు.

ఎంసెట్‌లో సీటు రాని విద్యార్థులందరూ ఎన్నారై కోటా క్రింద చేరడం అలవాటు. పేరుకు ఎన్నారై కోటా అని అంటారే తప్ప ఒక ఎన్నారై కూడా మన కాలేజీల్లో చేరడం లేదు. ఆ పేరుతో డబ్బుకట్టగల్గిన పిల్లలను చేర్చుకుంటున్నాయి కాలేజీ యాజమాన్యాలు. ఎన్నారై కోటా క్రింద కంప్యూటర్ వంటి కోర్సులకు నాలుగు నుంచి ఆరు లక్షల రూపాయలు వసూలు చేస్తున్నారు వీరు. అది గాక ఏడాదికి లక్ష ఫీజు క్రింద కట్టడం అంటే, మధ్యతరగతి కుటుంబాలకు అలివికాని పని.

కాలేజీ ఫీజులు కొంచెం, కొంచెంగా పెంచడం సమంజసం; కాని ఒకేసారి అరవై వేల నుంచి లక్షా రెండువేలకు పెంచడం దుర్మార్గం. చంద్రబాబు ఇటువంటి నిర్ణయాలు ఎందుకు తీసుకుంటున్నారో అర్థమే కావడం లేదు. •

# సణుగుడు

◆ ఎమ్పీగారు చిలకపలుకులు పనికి రావండి !
◆ పిల్లల పార్కు టూరిజం శాఖకు ఎందుకు ఇవ్వాలి !

నెల్లూరు ఎమ్పీ రాజేశ్వరమ్మ గారి దర్శనం మహా దుర్లభం. ఎన్నికల తర్వాత ఆమెను చూసే అదృష్టం కల్గిన వారి సంఖ్యను వేళ్లమీద లెక్క పెట్టవచ్చు. ఆమె ఎక్కడుం టున్నారో, ఏమి చేస్తున్నారో తెలిసిన వారూ అరుదే. రాజేశ్వరమ్మ స్వర్గీయ కామాక్షయ్య కుమార్తె; నెల్లూరు జనానికి ఢిల్లీలో పదిహేనేళ్లు ప్రతినిధిగా పనిచేసిన వారు కామాక్షయ్యగారు; ఢిల్లీ అని ఎందుకు అంటున్నానంటే, ఎమ్పీగా ఆయన ఢిల్లీలో తప్ప మరెక్కడా కనపడేవారు కారు. ఎన్నికల సమయంలో కూడా ఆయన దర్శనం దొరికేది కాదు. ఈ విషయంలో తన తండ్రి అడుగుజాడల్లో నడుస్తున్నట్లున్నారు, రాజేశ్వరమ్మ గారు.

అయితే కామాక్షయ్య గారి రోజులు వేరు; ఆయనకు ముందు ఒకటికి మూడు పర్యాయాలు నెల్లూరు ఎమ్పీగా గెలిచిన అంజనప్పకు నెల్లూరు నగరం దారి కూడా తెలియదు; నామినేషన్ వేయడానికి తప్ప నెల్లూరుకు

**డోలేంద్ర**

రావల్సిన అవసరం లేకుండానే ఆయన్ను గెలిపించి పంపించేవారు నెల్లూరు ఓటర్లు. అంజనప్పను చూసిన కంటితో కామాక్షయ్యను చూసినప్పుడు, ఈయనెంతో మెరుగు కదా అనిపించింది. కామాక్షయ్య కనీసం ఆత్మకూరులోనైనా అప్పుడప్పుడు కనిపించేవారు. కాని రాజేశ్వరమ్మకు ముందు ఎమ్పీ పసుపులేటి లక్ష్మి, ఎమ్పీ పదవిలో ఎంత మాధుర్యం వుందో నెల్లూరీయులకు చూపించినవారామె. ఎమ్మెల్యేల కంటె అధికంగా జిల్లా మొత్తం కాలికి బలపం కట్టుకుని తిరగడంతోపాటు, ప్రతి గ్రామానికి ఏదో ఒక ఉపకారం చేయడానికి తాపత్రయపడిన కార్యదక్షురాలు. ప్రజల దృష్టిలో పనిచేసే లక్ష్మిగా పేరుపొందిన ఉత్సాహవంతురాలు. మాజీ ఎమ్పీ లక్ష్మిని ఎమ్పీగా చూసి, ఇప్పుడు రాజేశ్వరమ్మను చూస్తుంటే - లక్ష్మి విలువ అర్థమౌతున్నది.

నెల్లూరు సెషన్‌లో రైల్వే ప్రతి ఒక్కరు లక్ష్మిని తలుచుకోకుండా వుండరనడం నిజం; కాని రాజేశ్వరమ్మ మన ఎమ్పీ అని జ్ఞాపకం పెట్టుకోగల్గిన వారు లేకుండా పోయే పరిస్థితి వస్తుందనడం అరోపణ కాదు.

ఇప్పటి ప్రస్తావన అది కాదు; పిల్లల పార్కు ప్రారంభోత్సవ సభ శిలాఫలకంపై తన పేరు లేనందుకు మునిసిపల్ కమిషనర్‌ను పట్టుకొని దులిపేసింది - రాజేశ్వరమ్మ. "నేను కామాక్షయ్య కూతుర్ని, నేను పార్లమెంట్‌లో ప్రివిలేజ్ మోషన్ పెడితే నీ వుద్యోగం ఏమైపోతుందో ఆలోచించుకో" అని బెదరించారట ఆమె. ఈ మాటలు పలికింది ఆమె అయినా, పలికించింది మాత్రం సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి గారు. పిల్లల పార్కు విషయంలో తనను ఎవ్వరూ పట్టించుకోలేదని మహా అసహనంగా వున్నారు చంద్రమోహన్; తనొక్కడే అది మాట్లాడితే చులకనైపోతానని భావించి, ఎమ్పీ చేత చిలక పలుకులు పలికించారు.

నియోజకవర్గంలో జరిగే సభలలో ఎమ్పీకి ఆహ్వానం అందచేయడం కనీస మర్యాద అన్న విషయం నిజం కాని, ఆ ఆహ్వానం అందుకోవడానికి ఆమె అందుబాటులో వుండడం కూడా అవసరం కదా? ఆ సభ జరిగినప్పుడు ఆమె అమెరికాలో వున్నారు; దేశంలోనే లేని వ్యక్తి పేరు సభలో పాల్గొంటున్నట్లు ఫలకంలో వేయడం మర్యాద అవుతుందా?

తాను వూళ్లో లేను కాబట్టి తనను పిలవలేదని రాజేశ్వరమ్మకు తెలుసు; కాని చంద్ర మోహన్‌రెడ్డి అడగమన్నారు కాబట్టి అడిగినట్లుంది. ఇటువంటి చిలక పలుకులు రాజకీయవారుల స్థాయి తగ్గిస్తాయి.

నామినేషన్ వేయడానికి కలెక్టరేట్‌కు వచ్చినప్పుడు, ప్రహోజ్ చేసే మనిషికూడా వెంటలేక, దిక్కు దిక్కు మంటూ వరండాలో గంటకు పైగా గడిపింది ఆమె; అంత అనామకురాలని కూడా చూడకుండా ఆమెను ఎమ్పీని చేశారు ఓటర్లు; ఆ గౌరవం నిలుపుకోవడానికి, ఆ ఓటర్లకు వుపయోగపడే పనులు చేయడం మర్యాద; కాని పనులు సంగతి దేవుడెరుగు, ఎమ్పీగా గెల్చిన తర్వాత ప్రజలకు కనపడటమే మానివేశారు; అందుకు సిగ్గు పడవలసింది పోయి, నేను ప్రివిలేజ్ మోషన్ పెడితే నీ వుద్యోగం పోతుందని అధికారులను బెదిరించడం మరీ చులకన ప్రాయపు ప్రవర్తన. చట్ట సభలలో ప్రివిలేజ్ వసతి కల్పించింది, ఎమ్పీలు తమ అహంకారం ప్రదర్శించుకోవడానికి కాదు; ప్రజా సంబంధ పనులలో అడ్డు తగిలే వారి నుంచి రక్షణ కల్పించడానికి ఈ వసతి కల్పించారు రాజ్యాంగ నిర్మాతలు. ఇటువంటి బెదరింపులు తన గౌరవాన్ని పల్చన చేస్తాయన్న విషయం ఆమె గ్రహిస్తే మంచిది.

***

పిల్లల పార్కు మొదలు పెట్టిన వేళ పోషం ఎటువంటిదో కాని, దానికి సంబంధించిన ప్రతి పనీ వివాదాస్పదమౌతున్నది. కలెక్టర్ గారిని నేరుగా అడగలేక, వాఖ్యానించలేక ఎవరూ పత్రికలకు ఎక్కలేదు కాని, ఈ పార్కును టూరిజం శాఖకు అప్పగించాలన్న ఆమె నిర్ణయం సగటు ప్రజలలో కూడా అసంతృప్తి కల్గిస్తుందన్న మాట నిజం. పని రాజకీయవాదులు పట్ల వీరికి గౌరవం ఏదీ ప్రత్యేకంగా మాట్లాడలేరు; కలెక్టర్, ఎస్పీ వంటి అధికార్ల విషయంలో అయితే మరీను. అధికారులకు

తొరవ 11వ పేజీలో

# పొగడ్తలు, ప్రచారాలతో పొద్దుగడిపితే సర్వనాశనమే!

ప్రపంచంలోనే అత్యంత అభ్యుదయ రాష్ట్రంగా అంతర్జాతీయ పత్రికలు, క్లింటన్ వంటి నేతల ప్రశంసలు అందుకున్న ఆంధ్రప్రదేశ్ క్రమక్రమంగా తన ప్రాభవం కోల్పోయే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రి అయిన తర్వాత ప్రారంభించిన ప్రచార ఉధృతికి మొత్తం ప్రపంచం హైదరాబాద్ పై దృష్టి సారించింది. హైటెక్ సిటీ, ఎలక్ట్రానిక్ గవర్నమెంట్, ఇంటర్నెట్‌లో డ్రైవింగ్ లైసెన్సులు వంటి పడికట్టు పదాలు వాడి చంద్రబాబు నాయుడు ఆంధ్రప్రదేశ్ అంటే అద్భుతాలు జరిగే ప్రదేశమని అభిప్రాయం కల్పించారు. ప్రపంచ బ్యాంకు వంటి సంస్థలు సైతం ఆ మాయలో పడిపోయాయి. కాని నాలుగేళ్ల గడిచిన తర్వాత పరిస్థితి చూస్తే, ఇవన్నీ వట్టి మాటలే తప్ప జరుగుతున్న పని ఏదీ లేదన్న అనుమానం మొదలు కావటంతో ఇంతకాలం చంద్రబాబును ఆకాశానికి ఎత్తి పొగిడిన వారంతా మెల్లమెల్లగా ప్రక్కకు తప్పుకుంటున్నారు.

మా దేశంలో ఇట్లా మాట్లాడితే జైలులో పెడతారు, లేదంటే పిచ్చాస్పత్రిలో చేరుస్తారు అని స్విట్జర్లాండ్ ఆర్థిక మంత్రి అన్నప్పుడు, అదొక జోక్ అనుకున్నాము; సింగపూర్ ప్రధాన మంత్రి ఆంధ్ర సిఎంని మునగచెట్టు ఎక్కించి, కర్నాటక ప్రభుత్వంతో వ్యాపార ఒప్పందం చేసుకొన్నప్పుడు ఏదోలే అనుకున్నాము; కొరియాకు చెందిన కార్ల ఫ్యాక్టరీ అధినేత హైదరాబాదును సిటీ ఆఫ్ హైపివర్స్ అని పొగిడి, మద్రాసులో తన ఫ్యాక్టరీ కట్టుకొన్నప్పుడు ముందుగా మద్రాసుతో సంబంధాలు వుండివుంటాయేమో అనుకున్నాము. కాని నాలుగేళ్లు గడిచిన తర్వాత ఒకసారి ఆత్మ విమర్శ చేసుకుని చూసుకుంటే, చంద్రబాబు ప్రచారం వల్ల ఆయనకు ప్రపంచ వ్యాప్త గుర్తింపు వచ్చిందే తప్ప, రాష్ట్రానికి ఒరిగిన ప్రయోజనం ఏదీ లేదన్న వాస్తవం అర్థమౌతుంది. ఇక ముందు కూడా జరగబోయే మేలు ఏదీ కన్పించక పోవడం మరీ విచారించదగిన విషయం.

## పరిశ్రమల స్థాపనకు పెట్టుబడులు ఆకర్షించడంలో కర్నాటకతో పోటీపడడం చంద్రబాబు తరం కావడం లేదు; హైటెక్ సిటీ నుంచి కంపెనీలు బెంగుళూరుకు తరలిపోతున్నాయి!

ప్రపంచ బ్యాంకుతో పాటు, దేశంలోని పెద్ద కార్పొరేట్ సంస్థలు, విదేశీ మల్టీనేషనల్ కంపెనీలు, ఎన్నారైలు వంటి వారంతా నిశ్శబ్దంగా ఆంధ్రను విస్మరించి కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలకు తరలి వెళ్లిపోతున్నారు. చంద్రబాబు నాయుడు, కర్నాటక ముఖ్యమంత్రి ఎస్.ఎం. కృష్ణల మధ్య పెట్టుబడులు ఆకర్షించడంలో స్పర్థ రేగినట్లు ఏడాది క్రితం వార్తలు వచ్చాయి. వీరిద్దరు పోటీలు పడుతున్నారని పత్రికలు వ్రాసాయి. అమెరికా అధ్యక్షుడు క్లింటన్‌ను తమ రాష్ట్రాలకు రప్పించుకోవడానికి వీరు పడిన తాపత్రయం తెలిసిందే. క్లింటన్ హైదరాబాదుకు వచ్చి, బెంగుళూరులో తన పర్యటన నుంచి మినహాయించడంతో చంద్రబాబు విజయ గాథలు ప్రచారంలోకి వచ్చాయి. కాని ఇప్పుడు పరిస్థితి చూస్తే, ఆంధ్ర రాష్ట్రానికి క్లింటన్ విజిట్ మాత్రమే మిగిలింది; కర్నాటకకు కొన్ని వేల కోట్ల రూపాయల విలువైన పరిశ్రమలు తరలి వెళ్లిపోయాయి. గత నెలలో బెంగుళూరులో జరిగిన ఒకే ఒక సదస్సులో 14వేల కోట్ల రూపాయల పెట్టుబడితో పరిశ్రమలు స్థాపించడానికి కార్పొరేట్ కంపెనీలు ఒప్పందాలు చేశాయి. ఇందులో రాబర్ట్ ముడాక్ వంటి అంతర్జాతీయ వ్యక్తులూ వున్నారు.

ఇంకొక ప్రక్క హైదరాబాద్‌లోని హైటెక్ సిటీ తన ప్రతిష్ఠతోపాటు, వ్యాపారం కూడా కోల్పోయింది. ఇప్పటి వరకు ఈ భవనంలో పూర్తిస్థాయి కార్యకలాపాలు జరగడం లేదు; స్థలం కొన్న వారు కూడా ఆఫీసులు పెట్టలేదు. పైపెచ్చు సత్యం వంటి హైదరాబాద్ కంపెనీలు సైతం తమ నూతన వ్యాపార కేంద్రాలను మద్రాసుకు తరలిస్తున్నాయి. మన హైటెక్ సిటీ విస్తీర్ణం కేవలం 6లక్షల చదరపు అడుగులు; చెన్నైనగరం నుంచి దీన్ని అమ్మడం మన తరం కావడం లేదు; కాని నాని బొంబాయిలో ఆరునెలల క్రితం 24లక్షల చదరపు అడుగులతో సాఫ్ట్‌వేర్ పార్కు నిర్మిస్తే మొత్తం విక్రయమై పోయింది. హైదరాబాద్ పట్ల కంప్యూటర్ కంపెనీల నిరుత్సాహానికి కారణం - చేసిన వాగ్దానాలేవీ నెరవేర్చక పోవడం. మూడేళ్ల క్రితం ఈ కంపెనీ ప్రతినిధులతో సమావేశం పెట్టి హైటెక్ సిటీలో వ్యాపారం ప్రారంభిస్తే 16 సౌకర్యాలు కల్పిస్తామని చంద్రబాబు నాయుడు వాగ్దానం చేశారు; కాని వాటిల్లో ఒక్కటి కూడా ఇప్పటి వరకు అమలు కాలేదు. కరెంట్ సబ్సిడీ విషయంలో కూడా తన మాట నెరవేర్చుకోలేక పోయారు ముఖ్యమంత్రి.

ఇదే సమయంలో కర్నాటక పెట్టుబడిదారులకు రెడ్ కార్పెట్ పరుస్తున్నది. సాంప్రదాయకంగా పారిశ్రామిక నగరమైన మద్రాసు తన పూర్వ వైభవం పునరుద్ధరించుకుంటున్నది. ఎస్.ఎం. కృష్ణ, కరుణానిధి మాటలు లేకుండా పని చేస్తున్నారు; చేసిన వాగ్దానాలు నెరవేరుస్తున్నారు. ఇంకొక ప్రక్క మహారాష్ట్ర ముఖ్యమంత్రి విలాస్‌రావ్ దేశ్‌ముఖ్, మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి దిగ్విజయసింగ్, ఒరిస్సా ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ తమ తమ రాష్ట్రాలకు పెట్టుబడులు ఆకర్షించడానికి సకల ప్రయత్నాలు చేస్తున్నారు. వీరందరితో పోటీ పడి, పారిశ్రామికవేత్తలకు సదుపాయాలు కల్పించడం మన ముఖ్యమంత్రికి చేతకావడం లేదు.

చంద్రబాబు గొప్పగా చెప్పుకునే సాఫ్ట్‌వేర్ పరిశ్రమ విషయం చూసినా - హైదరాబాద్ నుంచి కేవలం 1059 కోట్ల రూపాయల విలువైన ఎగుమతులు మాత్రం చేయగల్గింది; కర్నాటక ఎగుమతుల విలువ 4321 కోట్లు; మద్రాసు - 1890 కోట్లు; ఢిల్లీ - 2450 కోట్లు; ఈ లెక్కన మనం కర్నాటకతో సమానం కావడం అసాధ్యం గా కన్పిస్తున్నది. పారిశ్రామిక పెట్టుబడుల విషయంలోనూ ఆంధ్రప్రదేశ్ నాలుగవ స్థానం నుంచి పైకి ఎదగలేక పోతున్నది. గుజరాత్, మహారాష్ట్ర, తమిళనాడులు మనకు అందనంత ఎత్తులో వున్నాయి.

ప్రపంచ బ్యాంకు విషయమూ అంతే. బ్యాంకు అధ్యక్షుడు చంద్రబాబు నాయుడును పొగిడి, కర్నాటకకు అప్పులు ఇస్తున్నారు. ఈ సంవత్సరం ఆ రాష్ట్రానికి 4500 కోట్ల రూపాయలు విడుదల చేశారు; రానున్న ఐదేళ్లలో 12వేల కోట్ల రూపాయల అప్పు ఇవ్వడానికి ఒప్పందం మీద సంతకాలు చేశారు. కాని ఎస్.ఎం. కృష్ణ ఒక్క పత్రికలోనూ అది తన ఘనతగా వార్తలు వ్రాయించుకోలేదు. మన రాష్ట్రంలో ప్రపంచ బ్యాంకు నిధులను రాష్ట్ర ప్రభుత్వం పక్క దారి పట్టించడంతో, కొత్త అప్పులు ఇవ్వడానికి వారు అంగీకరించడం లేదు. ఇప్పటికి మంజూరైన ప్రాజెక్టులకు కూడా నిధులు విడుదల చేయడం లేదు. చాలా అవమానకరపరిస్థితి ఇది.

ఇదే ధోరణి కొనసాగిస్తే రాష్ట్ర ఆర్థిక పైసా అప్పు పుట్టని పరిస్థితి ఏర్పడుతుంది. ముఖ్యమంత్రి, రాష్ట్ర ప్రభుత్వం కూడా ఈ వాస్తవాన్ని గమనించి తప్పులు సరిదిద్దుకోవడం తక్షణావసరం. అందుకు మొదట చేయవలసిన పని, చెప్పిన మాటపై నిలబడడం, చేసిన వాగ్దానాలు నెరవేర్చడం. కేవలం పత్రికలలో ప్రచారానికి, పొగడ్తలకు మురిసిపోయి సరిపెట్టుకుంటే, రాష్ట్రానికి తీరని అన్యాయం జరుగుతుంది.*

రత్నం కోచింగ్ సెంటర్‌లో జరిగిన ర్యాంకర్ల అభినందన సభలో తమ గురువు, ఆత్మకూరులో సైన్స్ టీచర్ గుప్తను సన్మానిస్తున్న డైరెక్టర్లు కెవి. రత్నం, శ్రీమతి పద్మావతి రత్నం.

# అంత అసహనం ఎందుకు?

విద్యుత్ ఛార్జీల పెంపకంపై కాంగ్రెస్, వామపక్షాలు కలిసి ప్రారంభించిన నిరసన ఉద్యమం పట్ల ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వ్యక్తం చేస్తున్న అసహనం ఆక్షేపణీయం. ప్రతిపక్షాల వారు నక్సలైట్లతో కలసి విద్రోహచర్యలకు పాల్పడుతున్నారని ఒకసారి, నక్సలైట్ల కంటే అధ్వాన్నంగా ప్రవర్తిస్తున్నారని మరొకసారి విమర్శించారు ముఖ్యమంత్రి. చంద్రబాబు అంటే ఏమిటో చూపిస్తానని బెదరిస్తున్నారు; ప్రతిపక్ష పార్టీ కార్యకర్తల వంటి నిండా నెగటివ్ ధోరణి ప్రబలిపోయి వుందని హేళన చేస్తున్నారు.

ప్రతిపక్షాలు అడుగుతున్నది - కరెంట్ ఛార్జీల పెంపకం సహేతుకంగా లేదు కాబట్టి తగ్గించాలని; దానికి సమాధానం చెప్పడం, పెంపకం సమంజసమని నిరూపించుకోవడం ప్రభుత్వ బాధ్యత. తమ తమ వాదాలతో ప్రజలను ఎవరు నమ్మించగల్గితే, వారికి రాజకీయ ప్రయోజనం కల్గుతుంది. ప్రజాస్వామ్యంలో ఇదొక రాజకీయ క్రీడ; ప్రజాస్వామ్యాన్ని పరిపుష్టం చేసే ప్రక్రియ కూడా ఇదే. బ్రిటిష్ సర్కారు మదం, అణచడానికి మహాత్మాగాంధీ అనుసరించిన మార్గం ఇదేనన్న వాస్తవం మనమిక్కడ గుర్తుంచుకోవాలి. రవి అస్తమించని మహా సామ్రాజ్యం తమదని విర్రవీగుతుండిన తెల్లదొరలు, చలి చీమల చేత చిక్కిన కొండ చిలువ వలె తలదించుకొని తమ దేశానికి తిరిగి వెళ్లిపోవల్సిన పరిస్థితి కల్పించింది ఇటువంటి నిరసన ప్రదర్శనలే.

ఈ చరిత్ర చంద్రబాబుకు తెలియకుండా పోలేదు. కాని గత ఐదేళ్ల పరిపాలనలో ఇంత తీవ్రమైన ప్రజా వ్యతిరేకతను ఎదుర్కోవడం ఇదే ప్రథమం. అందువల్లే దీన్ని జీర్ణించుకోవడం ఆయన తరం కావడం లేదు. దానితో అదుపు తప్పి మాట్లాడుతున్నారు.

నిన్న మొన్నటి వరకు కరెంట్ ఆందోళనలో అభ్యంతరకరమైనది ఏదీ లేదు; ఎక్కడా ఈ ఉద్యమం అదుపు తప్పలేదు; వినతి పత్రాలు ఇవ్వడం, వూరేగింపులు చేయడం, ధర్నాలు జరిపించడం వరకే పరిమితమై వుండింది. ఆందోళనలు శాంతియుతంగా జరిగినంత వరకు అభ్యంతర పెట్టడానికి ఎవరికీ అధికారం లేదు.

ఈ నిజం విస్మరించి చంద్రబాబు నిరసనకారులపై అంత తీవ్రమైన ఆరోపణలు చేయడం గర్హనీయం. ముఖ్యమంత్రి వంటి వాడే అట్లా మాట్లాడడంతో స్వామి భక్తులైన పోలీసులు తమ నిగ్రహం కోల్పోతున్నారు. మొన్న బుధవారం విజయవాడలో జరిగింది అదే. మంత్రిని ఘెరావ్ చేయడానికి వచ్చిన కార్యకర్తలపైన మహిళలపైన పోలీసులు దౌర్జన్యం జరిపారు; విచక్షణా రహితంగా లాఠీలతో చావబాదారు; రాష్ట్ర సిపిఎం నేత బి.వి. రాఘవులు గారి సతీమణి పుణ్యవతి ఆ దెబ్బలకు స్పృహతప్పి పడిపోయారు. మహిళా సంక్షేమం కోసం తమ ప్రభుత్వం అంకితమై వుందని చెప్పుకొని, మహిళల ఓట్లతో అధికారం చేపట్టిన చంద్రబాబు నాయుడు ప్రభుత్వం మహిళల పట్ల అంత జుగుప్సాకరంగా ప్రవర్తించడం శోచనీయం. పోలీసులు తమ పరిధి మరిచిపోయి ప్రజలపై లాఠీలు ఝళిపించడానికి కారణం, నిరసన వుద్యమం పట్ల ముఖ్యమంత్రి ప్రదర్శిస్తున్న అసహనమే ననడం అతిశయోక్తి కాదు.

నిజానికి కరెంట్ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం మొదటి నుంచి సందేహాస్పదంగా వ్యవహరిస్తున్నది. ధరలు, సరఫరా, ఉత్పత్తి ఖర్చులు, ధన నష్టాలు, లైన్ నష్టాలు, రైతులు వాడే విద్యుత్ లెక్కలు వంటి

జమీన్‌రైతు

విషయాలన్నిటిలో ప్రభుత్వం ఒక్క మాట మీద నిలబడడం లేదు. ఒకసారి చెప్పిన అంకెలు మరొకసారి చెప్పడం లేదు. ఈ గందరగోళంవల్లె కరెంట్ ఛార్జీలు పెరిగాయని ప్రజలు తీవ్రంగా స్పందించారు; ప్రజలలో ఛార్జీల పట్ల ఆగ్రహం పెల్లుబుకుతున్నందు వల్లే ప్రతిపక్షాలు ఆందోళన చేయగల్గుతున్నాయి. లేకుంటే ఈ వుద్యమం ఇంత కాలం జరిగేది కాదు. చంద్రబాబు అధికారంలోకి వచ్చిన తర్వాత ఎన్ని సార్లో ప్రతిపక్షాలు రకరకాల ఆందోళనలు ప్రారంభించాయి; కాని అవేవి నిలవలేదు; మద్య పాన నిషేధం రద్దు వంటి నిర్ణయం పైన కూడా నిరసన కొనసాగించడం వారి తరం కాలేదు. అందుకు కారణం వాటికి ప్రజల నుంచి తగిన మద్దతు రాకపోవడం. ఇప్పుడు అదే ప్రజలు అదే ప్రభుత్వ నిర్ణయం పట్ల అసంతృప్తులై వున్నారు కాబట్టి ప్రతిపక్షాలు వుద్యమం చేయగల్గుతున్నారు. అది అర్థం చేసుకోవడం చంద్రబాబుకే మంచిది. అది అర్థం చేసుకోగల్గితే కరెంట్ ఛార్జీల పైన ఆయన ఇంత మూర్ఖంగా వ్యవహరించలేరు. ప్రజాస్వామ్యంలో ప్రజలకు ఇష్టం లేని పని చేయడం ఎంతో కాలం వీలు పడదు. ఎక్కడో ఒక దగ్గర ప్రజాభిప్రాయాన్ని అనుసరించి నడుచుకోక తప్పదు. చంద్రబాబైనా మరొక నాయకుడైనా ఇదే పరిస్థితి. •

---

## జమీన్‌రైతు

23.6.50

వెల: 0-2-0 పేజీలు: 12

### రంగాగారి ఆరోగ్యం

ఆచార్య రంగా గారి ఆరోగ్యం పూర్తిగా బాగున్నది. ఇటీవల పక్షం దినాలుగా ఆయన మసూచికంతో బాధపడుతున్నారు. బుధవారం నాడు స్నానం చేశారు. స్ఫోటకం తీవ్రంగా లేకపోవుట చేత ఎక్కువ ఆందోళన అక్కరలేకనే ఆరోగ్యం చక్కబడింది. కొలది దినాల్లోనే ఆయన మళ్లా తమ పూర్వపు ఆరోగ్యాన్ని బలాన్ని పొందగలరు.

### మెయిల్ ప్రమాదస్తులకు పరిహారం

సూళ్లూరుపేట మెయిల్ ప్రమాదానికి గురియైన వారి తరఫున పరిహారానికిగా నెల్లూరు ప్రిన్సిపల్ సబ్‌జడ్జి, క్లెయిమ్స్ కమీషనరైన డి. ఆదినారాయణయ్య ఎం.ఏ; బి.ఎల్ గారి కోర్టులో 64 దరఖాస్తులు చేయబడ్డాయి.

రైల్వే రూల్సులో నెలకు వెయ్యి రూపాయలు సంపాద్యమున్న వ్యక్తి చనిపోతే 10వేల రూపాయలు పరిహారమివ్వవలసినట్లుగా వున్నది.

### అల్లూరు పంచాయతీలో కుంభకోణం

అల్లూరు పంచాయతీ బోర్డుకు పెట్రోమాక్సులైట్లు కావలసి వచ్చినవి. ధరలు గూర్చి బొంబాయి, మద్రాసులకు వ్రాయగా బొంబాయి 'షా అండ్ కంపెనీ' వారు లైటు 1-కి రు105లున్నూ, మద్రాసులోని 'పన్నాలాల్ - జామాలాల్ కంపెనీ' వారు లైటు 1-కి రు110/-లు ధర వున్నట్లు వ్రాసినారు. న్యాయమైతే ఈ రెంటిలో తక్కువ రేటు వున్నచోటు నుండి లైట్లు తెప్పించాలి. ఇక్కడ అట్లా జరగలేదు. తెలివిగల పురుషుడు శ్రీశ్రీ బి. సుబ్బారాయలు నాయుడి గారిని లైట్లుకొని తెచ్చుటకు బోర్డు వారు అనుమతించి పంపినారు. వీరు మద్రాసు వెళ్లి లైటు 1-కి రు180ల ధరపెట్టి 9లైట్లు కొనుక్కొచ్చారు. అట్లనే ఒక ఇనుపపెట్టె గూడా చేసే ధర కంటే విపరీతమైన హెచ్చుధరకు కొనుక్కొచ్చారు. మరొక తమాషేమిటంటే లైట్లు సిద్ధంగా వున్నవి గూడ కాకుండా పరాయి దేశాన్నుంచి స్టీమరులో ప్రయాణం చేస్తున్న లైట్లనుకొని వచ్చారు. బోర్డు వారు ఈ చర్యను గంగెద్దు మాదిరి తలవూగులాడించి ఆమోదించారు. మొత్తానికి 1110-8-6 పైసలు మేర

## 50 ఏళ్ళక్రితం ఈ వారం

కుంభకోణం జరిగింది. బోర్డు ప్రెసిడెంటు మేడా పిచ్చారెడ్డి ఈ వ్యవహారానికి తలకాయ యెట్లా వూగు లాడించారో? బడా బడా, పెద్ద పెద్ద గొప్ప గొప్ప మహానాయకులుండే అల్లూరు యెట్లా కుక్కిన పేనుమాదిరి లాలూచీ పడ్డదో?

### నెల్లూరు ముచ్చట్లు మనలో మాటలు

మంత్రివర్గ పక్షం వారైన ఏ.సి. సుబ్బారెడ్డి, వంగల్లు కోదండరామిరెడ్డి గార్ల మధ్య పొర పొచ్చాలు పెరిగి జిల్లాకు చెరుపు చేస్తున్నది. వాళ్లిద్దరూ ఇది గమనించడం లేదు. వారి స్వీయ ప్రతిభ హెచ్చిందను కొంటున్నారు. కాని బజారులో తగ్గిపోయింది - తగ్గిపోతున్నది - తగ్గిపోతుంది.

### జిల్లా పెద్దలకొక సూచన

ఏ.సి.రెడ్డి, పరాయి పక్షం వారయిన రాఘవయ్య, మనేకం గానడానికి

తరువాయి 10వ పేజీలో

---

## జనవాణి

# సంస్కరణలా? జీవన్మరణ సమస్యలా??

రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన విద్యుత్ సంస్కరణలు వినియోగదారులపట్ల పెనుశాపాలుగా మారడం దురదృష్టకరం. కనివిని ఎరుగని రీతిలో ఇటీవల పెరిగిన విద్యుత్ ఛార్జీలను తలచుకొంటేనే సంస్కరణ లంటే జనానికి వణుకుపుట్టిస్తున్నది. ఏ రంగంలోనైనా సంస్కరణలు అమలు జరిగేటప్పుడు విధిగా సామాజిక న్యాయాన్ని పాటించడం ధర్మం. రాష్ట్ర ప్రభుత్వం, విద్యుత్ సంస్థలు ఈ ప్రాథమిక సత్యాన్ని విస్మరించడం దారుణం. సంస్కరణల పేరుతో విద్యుత్ సంస్థను విభజించడం సరైన చర్యే. కాని ఆ తర్వాత ఆచరించ వలసిన కార్యక్రమమే బండెనుక గుర్రాన్ని కట్టిన చందమైంది. విభజనకు వెనువెంటనే విద్యుత్ ఉత్పత్తి కార్యాచరణ సరఫరాను ఆధునీకరించడం, విద్యుత్ చౌర్యాన్ని అరికట్టడం, అవినీతిని రూపుమాపడం వగైరా అవసరమైన చర్యలను చేపట్టవలసింది పోయి వినియోగదారులకు అధిక ధరలతో షాకులివ్వడం దారుణం. ఒక ఆరు నెలల కాలమైనా విద్యుత్ సంస్కరణల అమలును సమీక్షించిన మీదట నికరంగా తేలిన నష్టాలను పూడ్చేందుకు జనం మీద భారాన్ని మోపి వుండవల్సింది. అల్పాదాయాలతో, అధిక ధరలతో ఇప్పటికే బ్రతుకుభారమైన సామాన్యులకు మరికొంత వెసులుబాటు కల్పించడం రాష్ట్ర ప్రభుత్వం తక్షణ కర్తవ్యం.

విశాఖపట్నం — ఎం.రామ్మూర్తి

### ఇక అంధకారంలో బ్రతకాల్సిందే!

విద్యుత్ ఛార్జీలు విపరీతంగా పెంచడం వల్ల సామాన్య, మధ్య తరగతి ప్రజల జీవనం అస్తవ్యస్తంగా తయారయ్యింది. టౌన్‌లో ఏదైన చిన్నపాటి ఉద్యోగంలో చేరితే వెయ్యి రూపాయల నుంచి 1500 రూపాయల వరకు జీతం ఇస్తారు. ఈ జీతంతో ఇంటి బాడుగ, భోజన ఖర్చులు, పిల్లల పుస్తకాల ఖర్చు, ఇతర ఖర్చులతో చాలామంది చావలేక బతుకుతున్నారు. ఈ దశలో కరెంట్ ఛార్జీలు పెంచడం దారుణం. సామాన్య, మధ్య తరగతి ప్రజల జీవన ప్రమాణం పెంచే విధంగా ప్రభుత్వం చర్యలు తీసుకోకుండా, నిత్యావసరాలపై రేట్లు పెంచుతూ పోవడం అన్యాయం.

నెల్లూరు — వి. సుధారాణి

### నిందలన్నీ ఆర్ఎస్ఎస్‌పైనే!

ఇటీవల రాష్ట్రంలోని కొన్ని చర్చిలలో జరిగిన బాంబు పేలుళ్ల వెనుక ఆర్ఎస్ఎస్ అనుబంధ సంస్థల హస్తముందని క్రైస్తవ సంస్థలు అనుమానించడం అనుచితం. గతవారం జమీన్‌రైతు సంపాదకీయంలో మత ప్రచారం కన్నా సేవకే క్రైస్తవ సంస్థలు అంకితమై వున్నాయని వ్రాశారు. కాని గత ఏడాది భారతదేశంలో పర్యటించిన పోప్ ఆసియా ఖండంలో క్రైస్తవ మత వ్యాప్తికి వేగవంతంగా పనిచేయాలని పిలుపునిచ్చారు. ప్రపంచంలో హిందువుల కన్నా శాంతికాముకులు వేరొకరు లేరు. భారతదేశంలో పెక్కు మతస్థులు ఎటువంటి వత్తిళ్లకు లోనవ్వకుండా పనిచేస్తున్నాయంటే దానికి కారణం హిందువుల్లోని పరమత సహనమే. నిజానికి ఆర్ఎస్ఎస్, చర్చిలను బాంబులతో పేల్చాలని నిర్ణయిస్తే దేశంలో ఏ చర్చి మిగలదు. బాంబులు పెట్టే సంస్కృతి సంఘపరివార్‌దైతే అయోధ్యలోని బాబ్రీ మసీదును ఎప్పుడో బాంబులతో కూల్చేసేవారు. ఒరిస్సాలో జరిగిన మత బోధకుని హత్యలో ముందు ఆర్ఎస్ఎస్‌కు సంబంధముందని గ్లోబెల్ ప్రచారం చేసి దర్యాప్తు తర్వాత నోరుమూశారు. ఈ వ్యవహారంలో తమ నిర్దోషిత్వాన్ని ఆర్ఎస్ఎస్ నిరూపించుకోనవసరం లేదు.

తరువాయి 10వ పేజీలో

# కౌన్సిల్‌లో 'కక్కసు' రాజకీయం

నెల్లూరు మున్సిపాలిటీలో తెలుగుదేశం పార్టీ రాజకీయాలు కంపు. కంపుగా తయార య్యాయి. పార్టీలో ఆధిపత్యం కోసం రమేష్‌రెడ్డి కౌన్సిలర్ల మధ్య రగిల్చిన చిచ్చు పార్టీని, నిలువునా చీల్చింది. బుధవారం నాడు జరగాల్సిన

## జోక్యం చేసుకుంటే తిక్క కుదిర్చేస్తా - ఆదాలకు రమేష్ తీవ్ర హెచ్చరిక!

మున్సిపల్ కో ఆప్షన్ సభ్యుల ఎన్నిక వాయిదా వ్యవహారం తెలుగుదేశం పార్టీలో ముఠా తగాదాలకు అద్దం పట్టింది. మున్సిపల్ వ్యవహారాలలో మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మాట నెగ్గకూడదన్న పంతంతో రమేష్‌రెడ్డి, సర్వేపల్లి ఎమ్మెల్యే చంద్రమోహన్‌రెడ్డి రాజకీయాలు నడిపి, ఎన్నిక వాయిదాకు కారకులయ్యారు. మున్సిపాలిటీలో ముగ్గురు కో ఆప్టెడ్ సభ్యుల ఎంపిక కోసం 15 రోజుల క్రితమే వైస్ పర్సన్ నోటిఫికేషన్ జారీ చేసింది. గతంలో మున్సిపల్ కమిటీలకు జరిగిన ఎన్నికల విషయంలో, తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలు ఒక అవగాహనకు వచ్చి, మూడు కో ఆప్షన్ స్థానాలను, తెలుగుదేశం, బిజెపి, కాంగ్రెస్ పార్టీలు సమంగా పంచుకోవాలని నిర్ణయించు కున్నాయి. తెలుగుదేశం పార్టీ నెల్లూరు ఇన్‌ఛార్జి పొలగోపాల చౌదరి, మంత్రి వర్గీయుడైన శ్రీధరకృష్ణారెడ్డి, కాంగ్రెస్ పార్టీకి చెందిన వైస్ ఛైర్మన్ సందానిబాషా మధ్య కుదిరిన ఈ ఒప్పందాన్ని రమేష్‌రెడ్డి రాజకీయ ప్రయోజనాలకు వాడుకోవాలని పథకం వేశాడు. వైస్ ఛైర్మన్ ఎన్నికలో కాంగ్రెస్ అభ్యర్థి

తరువాయి 11వ పేజీలో



# అధికార్లకు 'ఆనం' షాక్

పెంచిన విద్యుత్ ఛార్జీల విషయమై ప్రజలకు వివరించేందుకు, అక్రమ విద్యుత్ కనెక్షన్లను క్రమబద్ధీకరించేందుకు ట్రాన్స్‌కో అధికారులు నెల్లూరు చుట్టు ప్రక్కల నిర్వహించిన గ్రామసభలపై ప్రజలు తిరగ బడ్డారు. 19తేది నెల్లూరు, రాపూరు నియోజక వర్గాల

## విద్యుత్ సభల్లో నిరసన వెల్లువ

పరిధిలోని పద్దె పటూరి పివారు ప్రాంతాల్లోని పడారుపల్లి, మన్సూర్‌నగర్ పిల్లలంగల కాలనీ, డైవర్స్ కాలనీ, బలిజపాళెంలలో ఉదయం 8గంటలకే విద్యుత్ శాఖాధికారులు గ్రామసభలు నిర్వహించేందుకు చేరుకొన్నారు. సభ నిర్వహణ సమయం, విద్యుత్‌చార్జీల గురించి వివరిస్తూ తక్షణం డిపాజిట్లు కట్టేవారికి కొత్తకనెక్షన్లు ఇస్తామని చెప్పనారంభించారు. ఈదశలో నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి నేతృత్వంలో మహిళలు ఈ సభల వద్దకు చేరుకొని ట్రాన్స్‌కో అధికారులపై ప్రశ్నలు సంధించగా, వారు సమాధానాలు చెప్పలేక నీళ్లు నమిలారు. ఒక మహిళ విద్యుత్ వినియోగంపై వివరణ ఇస్తూ రోజుకు నాలుగు గంటల చొప్పున ఒక బల్బుకు నెలకు 7.50పైసలు అవుతుంటే, ప్రస్తుత స్లాబ్ పద్ధతిన నెలకు 50నుంచి 60రూపాయల వరకు ప్రభుత్వం వసూలు చేయబూనడం ఎంత మేరకు సబబని ప్రశ్నించింది. మరో మహిళ 1994వరకు బాదాల బాబులో నడిపిన విద్యుత్ బోర్డు తర్వాత నష్టాల బారిన ఎందుకు పడిందో వివరించాలంది. అనసూయమ్మ అనే వృద్ధ మహిళ నెలంతా కూలీ, నాలీ చేసినా మూడు పూటల తినేందుకు తిండి సరిగ్గాలేదు. ఇంతేసి

తరువాయి 11వ పేజీలో

# కలాలకు, లాఠీలకు ఆటల పోటీ

వృత్తిపరమైన వైరంతో నిత్యం కస్సు బుస్సు లాడుకొంటుండే పోలీసులు, జర్నలిస్టుల మధ్య మైత్రీబంధం ఏర్పడాలని జిల్లా పోలీసు అధికారుల సంఘం సంకల్పించి, దీనికి నాందిగా 18తేదీ ఇద్దరి మధ్య క్రీడోత్సవం నిర్వహించింది. దేహ దారుఢ్యంతో తోపాటు క్రీడాకారులు

## నెల్లూరులో సందడి

ఎక్కువగా వుండే పోలీసుల జట్లతో జరిగిన అన్ని పోటీల్లో జర్నలిస్టులు గట్టి పోటీనిచ్చారు. పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో ఉదయం పోటీలను ప్రారంభించి జిల్లా ఎస్పీ సి.వి.నరసయ్య మాట్లాడారు. జర్నలిస్టులు, పోలీసులు కలసి క్రీడోత్సవంలో పాల్గొనడం వింతగా చెప్పవచ్చు జర్నలిస్టులు, పోలీసుల వృత్తుల మధ్య సారూప్యత వుంది. ఇద్దరు వేళాపాళా లేకుండా పనిచేస్తారు. విధినిర్వహణలో ఇద్దరికి నిత్యం మానసిక వత్తిడి ఎక్కువగా వుంటుందని పేర్కొందారు. అనంతరం జరిగిన బాడ్మింటన్, వాలీబాల్ పోటీల్లో పోలీసులు, క్రికెట్, టగ్గాఫ్ వార్‌లో జర్నలిస్టుల జట్లు విజయం సాధించాయి. క్రికెట్ ఆటలో ఎఎస్పీ రవికుమార్ మూర్తి ఆల్‌రౌండ్ ప్రతిభ కనబర్చి 5వికెట్లు కూల్చడంతో పాటు చక్కటి బ్యాటింగ్, ఫీల్డింగ్ చేసారు. సాయంత్రం బహుమతుల ప్రదానోత్స వానికి జిల్లా కలెక్టర్ శ్రీమతి శ్రీలక్ష్మి ముఖ్య అతిధిగా విచ్చేసి మాట్లాడారు. నిరంతరం శ్రమించే పోలీసుల, జర్నలిస్టుల మనోల్లాసానికి క్రీడోత్సవం ఎంతగానో తోడ్పడి వుంటుందని భావిస్తాను.

తరువాయి 11వ పేజీలో

# కాన్వెంట్లలో దొరతనం 'దోపిడి'!

నెల్లూరు టౌన్‌లో పుట్టగొడుగుల్లా వెలసిన కాన్వెంట్లు దోపిడిలో దొరతనం ప్రదర్శిస్తున్నాయి. సామాన్య, మధ్యతరగతి ప్రజలను వారి బలహీనతలను ఆధారం చేసుకొని గోళ్లూడగొట్టి, మరీ డబ్బులు వసూలు చేస్తున్నారు. ఇంగ్లీషు చదువుల మీద మమకారంతో ఈ స్కూళ్లలో తమ పిల్లలను చేర్పిస్తున్న తల్లిదండ్రుల జేబులు ఖాళీ అవుతున్నాయి. తప్ప వస్తున్న చదువు అంతంత మాత్రంగానే వుంది. నెల్లూరులో వీధికొకటిగా 200లకు పైగా వెలసిన ఈ కాన్వెంట్లలో కనీస వసతులు లేవు. పిల్లలను నేలమీదే కూర్చోబెట్టి పాఠాలు చెబుతుంటారు. ఒక చిన్న పాత బిల్డింగును అద్దెకు తీసుకొని వందల మంది విద్యార్థులను అందులో కుక్కుతున్నారు. కొన్ని స్కూళ్లు కుక్కల దొడ్లకంటే హీనంగా ఉన్నాయి. ఈ స్కూళ్లలో అర్హత కలిగిన ఉపాధ్యాయులను వేళ్లమీద లెక్కించ వచ్చు. 10వ తరగతి, ఇంటర్, డిగ్రీ ఫెయిల్ అయిన వారు కిండర్‌గార్డెన్ నుంచి పదవ తరగతి వరకు పాఠాలు చెప్పేస్తుంటారు. కిండర్ గార్డెన్‌లో చేర్పించే విద్యార్థుల వద్ద నుంచి 100 రూపాయల నుంచి 500 రూపాయల వరకు నెల ఫీజులు. ఈ కాన్వెంట్లలో వసూలు చేస్తున్నారు. ముందుగా బిల్డింగ్ ఫండ్‌తోపాటు రకరకాల ఫీజుల పేరుతో కొనేపన్న రూపంలో

## నెల్లూరులో విద్యా 'వ్యాపారం'

వేలాది రూపాయలు వసూలు చేస్తున్నారు. టౌన్‌లో వేల రూపాయలు మేర డొనేషన్ వసూలు చేసే కాన్వెంట్స్ కూడా వున్నాయి. ఈ కాన్వెంట్ల యాజమాన్యం డబ్బుపై కక్కుర్తితో ఇక్కడే దుకాణాలు తెరుస్తున్నారు. వీళ్లే యూనిఫారాలు, బూట్లు, బెల్టులు, పుస్తకాలు, మార్కెట్ ధరలకన్నా అధిక ధరలకు విక్రయిస్తున్నారు. ఈ కాన్వెంట్లలో వేలాది రూపాయలు ఫీజులు చెల్లిస్తున్న తల్లిదండ్రులు కాన్వెంట్స్‌లో బిడ్డలకు సరియైన చదువు చెప్పకుంటే టీచర్స్‌ను ప్రశ్నించే హక్కు లేదు. ఫీజులు కట్టేటోళ్లు మాత్రమే కాన్వెంట్ గేటు దాటిలోపలికి ప్రవేశం లభిస్తుంది. టౌన్‌లో 200పైగా వున్న కాన్వెంట్స్‌లో 150కిపైగా కాన్వెంట్స్‌కు ప్రభుత్వ గుర్తింపు లేదు. గుర్తింపు లేని స్కూళ్ల నుండి తమ పిల్లలను వేరే స్కూళ్లలో చేర్పించాల్సి వచ్చినప్పుడు తల్లిదండ్రులు నానాపాట్లు పడుతున్నారు. నెల్లూరుటౌన్‌లోని మునిసిపల్, ఎయిడెడ్ స్కూళ్లలో మంచి సంబంధ ప్రత్యేక అర్హతతో వివిధ పాఠ్యాంశాల్లో ప్రత్యేక శిక్షణ కలిగిన ఉపాధ్యాయులు, తగినంత మంది వుండి విద్యార్థులు లేక గోళ్లు గిల్లుకొంటూ కూర్చొంటున్నారు. తమ పిల్లల చేత 'మమ్మీ - డాడీ' అనిపించుకోవాలన్న మమకారమే తల్లిదండ్రులను కాన్వెంట్ల గడపతొక్కిస్తూ నష్టపోయేలా చేస్తుంది. మునిసిపల్ పాఠశాలల్లో పకడ్బందీ చదువులకు డి.ఇ.ఓ ప్రణాళిక రూపొందిస్తే తప్ప ఈ కాన్వెంట్ల దోపిడి ఆగదు.

# ర్యాంకుల 'రత్నాలకు' పురస్కారం

నెల్లూరులోని రత్నం కోచింగ్ సెంటర్‌లో శిక్షణ పొంది ఎంసెట్, ఇంటర్, ఎపిఆర్‌జెసి పోటీ పరీక్షల్లో ర్యాంకుల పంట పండించిన విద్యార్థులను 'రత్నం' మాస్టారు 18తేది ఘనంగా సన్మానించారు. ఈ సన్మానానికి 25ఏళ్ల క్రితం ఆయన స్థాపించిన కోచింగ్ సెంటర్‌లో కోచింగ్ తీసుకొని ప్రస్తుతం డాక్టర్లుగా వున్న పలువురు విచ్చేసి, ఈయేటి బ్యాచ్‌లో డాక్టర్లు కాబోతున్న వారికి బంగారు బ్రాస్‌లెట్లు బహూకరించారు. అపోలో హాస్పిటల్ ఎదురుగావున్న రత్నం గెస్ట్‌హౌస్ ఆవరణలో ఆహ్లాదకరమైన వాతావరణంలో రెండు గంటల పాటు జరిగిన ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిధులు ఎవరూ లేరు. కె.వి. రత్నం, సంస్థల అకడమిక్ కోఆర్డినేటర్ కోరా, ప్రిన్సిపల్ నాగరాజారావు, డాక్టర్ శ్రీధర్‌రెడ్డి తమ చేతులమీదుగా ఈ కార్యక్రమం జరిపించారు. రత్నం సంస్థల మీద అభిమానంతో కాబోటు

## నెల్లూరుసంగతులు

ఈ కార్యక్రమం ఆత్మీయతలతో కిటకిటలాడింది. ప్రిన్సిపల్ నాగరాజారావు మాట్లాడుతూ ఫస్ట్ మార్కులతో నెల్లూరు విద్యార్థులు పరిమితమై పోకూడదు. డాక్టర్లు, ఇంజనీర్లుగా ఎదగాలని 25ఏళ్ల క్రితం రత్నం సార్ ఈ సంస్థను స్థాపించారు. స్థాపించి నప్పటి నుంచి ర్యాంకుల పంటే. 1994లో కోచింగ్ తీసుకొని స్టేట్ ర్యాంకు తెచ్చుకున్న అబ్దుల్ రోషన్, 1995 బ్యాచ్ విద్యార్థి అమరేష్ అమెరికాలో తిరుగులేని ఇంజనీర్లుగా పేరుతెచ్చుకొన్నారు. గురుప్రసాద్ అనే విద్యార్థి ఐఎఎస్ ఆఫీసర్ అయ్యారు. డాక్టర్లు, ఇంజనీర్ల లిస్టు చదివితే రెండు గంటల సమయం కూడా చాలదని విస్మయంగా చెప్పారు. సంస్థల విజయం వాటాలకు క్రెడిట్ డైరక్టర్లు రత్నం, వేణుగోపాల్‌లకే చెందుతుందన్నారు. సంస్థ డైరక్టర్ కె.వి.రత్నం మాట్లాడుతూ ఎంసెట్ మెడికల్ విభాగంలో రాష్ట్రస్థాయిలో వందలోపు

తరువాయి 11వ పేజీలో

# కాంగ్రెస్ ఎమ్మెల్యేలా? రౌడీలా???

జిల్లాలో అక్రమ విద్యుత్ కనెక్షన్లను క్రమబద్ధీకరించుకొనేందుకు ప్రజలు ఉత్సాహం చూపుతుంటే, కాంగ్రెస్ ఎమ్మెల్యేలు రౌడీల్లా అడ్డు పడుతున్నారని సర్వేపల్లి ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి విమర్శించారు. 22తేది విలేఖరులతో మాట్లాడుతూ అక్రమ

## సోమిరెడ్డి ధ్వజం

కనెక్షన్ల క్రమబద్ధీకరణ కార్యక్రమం ప్రజలకు ఎంతగానో ఉపయోగపడేదన్నారు. ఈ వ్యవహారమై నిరసన తెలియజేయడానికి కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలకు ఒక హద్దుంది. కాని ఈ రెండు పార్టీలు హద్దుదాటి ప్రజలను ఇబ్బందులు పెడుతున్నాయి. వీరెంత నిరసన ప్రదర్శనలు చేసి గ్రామసభలను అడ్డుకొన్నా జిల్లాలో 21తేది వరకు 10,835 మంది 34లక్షల 8వేల రూపాయలు కట్టి తమ అక్రమ కనెక్షన్లను క్రమబద్ధీకరించు కొన్నట్లు చెప్పారు. 4,046 మంది వ్యవసాయ కనెక్షన్ల కోసం దరఖాస్తు చేశారు. ఈ కార్యక్రమం ముగిసేలోపల 30వేల మందిపైగా ప్రజలు తమ అక్రమ కనెక్షన్లను క్రమబద్ధీకరించు కొంటారన్న ఆశాభావాన్ని చంద్రమోహనరెడ్డి వ్యక్తం చేశారు. జిల్లాలోని ఇద్దరు కాంగ్రెస్ ఎమ్మెల్యేలు గ్రామాలకు కార్లు వేసుకొని వెళ్లి విద్యుత్ అధికారులపై దౌర్జన్యం చేయడం ఏమిటి? ట్రాన్స్‌కో జీపు అద్దాలను

తొరువ 8వ పేజీలో

సూళ్లూరుపేటలో సాంఘిక సంక్షేమశాఖ నేతృత్వంలో నడిచే గురుకుల బాలికల పాఠశాలను ప్రారంభించిన మాట్లాడుతున్న ఆ శాఖమంత్రి పుష్పలీల. కూర్చొన్నవారిలో మంత్రులు ప్రభాకరరెడ్డి, రామచంద్రరావు, ఎమ్మెల్యే పరసారత్నం, కలెక్టర్ శ్రీలక్ష్మి వున్నారు.

# ఉక్కాలకు ఉక్రోషం వచ్చిందండీ!

తన పనితాను చేసుకపోయే నెల్లూరు ఎమ్పీ డాక్టర్ వుక్కాల రాజేశ్వరమ్మ, నెల్లూరు మునిసిపల్ కమీషనర్ వేమారెడ్డిని చూసి తోకతొక్కిన త్రాసుపామయ్యారు. సహజంగా ఒకటి, రెండు మాటలకు మించి మాట్లాడని ఎమ్పీ, 'గంగిరెద్దు'వని కమీషనర్‌ను కసితీరా తిట్టారు. తన తడాఖా ఏమిటో చూపిస్తానని హెచ్చరించారు. దీని కంతటికీ కారణం చిల్డ్రన్స్ పార్కు ప్రారంభోత్సవ శిలాఫలకంపై మొదట

## కమీషనర్‌పై కస్సు బుస్సు

ఎమ్పీ పేరు లేకపోవడమే. 21తేది మునిసిపల్‌కో ఆప్టెడ్ సభ్యుల ఎన్నికలో ఓటు వేసేందుకు వచ్చి ఛైర్మన్ ఛాంబర్‌లో కూర్చొని వున్న ఆమెకు, ఈ ఎన్నికను వాయిదావేసి ఆ విషయం చెప్పను వచ్చిన కమీషనర్‌ను చూసి శివాలెత్తిపోయారు. చిల్డ్రన్స్ పార్కు ప్రారంభోత్సవ కార్యక్రమం ఎవరి ఆధ్వర్యంలో జరిగింది? ఎమ్పీ అంటే లెక్కలేదా? ప్రోటోకాల్ గూర్చి మీకు తెలియదా? ఆహ్వానపత్రం పంపాల్సిన బాధ్యత లేదా? అని ప్రశ్నల వర్షం కురిపించారు. ఈ కార్యక్రమం మునిసిపాలిటీ ఆధ్వర్యంలో జరగలేదని కమీషనర్ చెప్పబోగా, అయితే అందరికీ స్వాగతం చెబుతున్నట్లు మునిసిపాలిటీ ఎందుకు బ్యానర్లుకట్టిందని ప్రశ్నించారు. ఇంతలో సర్వేపల్లి ఎమ్మెల్యే చంద్రమోహనరెడ్డి జోక్యం చేసుకొని పార్కు ప్రారంభోత్సవం జరిగిన తర్వాత పత్రికల కిచ్చిన కృతజ్ఞతల ప్రకటనలో తన పేరు, ఎమ్పీ పేరు లేకుండా వేయడం వెనుకగల మర్మమేమిటో అర్థం కావడం లేదన్నారు. పార్లమెంట్ ప్రివిలేజ్ కమిటీకి ఫిర్యాదు చేస్తే మీరు వెళ్లి కమిటీ ముందు చేతులు కట్టుకొని నిలబడాల్సి వస్తుందని కమీషనర్‌ను భయపెట్టారు. జరిగిన విషయాలన్నీ ఆధారాలతో సహా ముఖ్యమంత్రికి తాను వివరించగా తనకు అన్యాయం జరిగిందనే ఆయన చెప్పారని రాజేశ్వరమ్మ వివరించారు. ముఖ్యమంత్రి పేషీలోని అధికారులు సైతం నెల్లూరులో ఈ విధంగా ఎందుకు జరుగుతుందని ప్రశ్నించారని, ఇది జిల్లాకు అవమానం కాదా అని అన్నారామె. చిల్డ్రన్స్‌పార్కు శిలాఫలకంపై తన పేరు లేకుంటే ఇక నుంచి ఏ శిలాఫలకాలపై తన పేరు వద్దని, ఒకవేళ చెక్కించినా తానే వాటిని పగులగొట్టిస్తానని ఆవేశంగా చెప్పారు.

# ఆపరేషన్ చేయించుకుంటే రేషన్‌కార్డు తిరిగి ఇస్తా!

కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల లక్ష్యాన్ని సాధించేందుకు అధికారులు ప్రజలను నానా తిప్పలు పెడుతున్నారు. దక్కిలి మండలం దగ్గవోలు గ్రామంలో కొందరి వద్ద తెల్లకార్డులను ఎమ్మార్వో బలవంతంగా స్వాధీనం చేసుకొని, కుటుంబ నియంత్రణ

## జిల్లావార్తలు

ఆపరేషన్లు చేయించుకొంటే తిరిగి వీటిని ఇస్తానని బెదరించారట. 19తేది జరిగిన గ్రామసభలో కార్డుల కోసం ఆపరేషన్లు చేసుకొన్న మహిళలు తమకు జరిగిన అన్యాయాన్ని ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ దృష్టికి తీసుకవెళ్లగా ఆమె ఎమ్మార్వోను నిలదీసి విషయం రాబట్టారు. ఐదుగురు మహిళలకు ఒక్కొక్కరే సంతానంగా వున్నా, ఎమ్మార్వో కార్డులు స్వాధీనం చేసుకొని ఆపరేషన్లు బలవంతంగా చేయించారట. మొత్తానికిఎమ్మర్జెన్సీ రోజులను గుర్తుకు తెచ్చాడీ ఎమ్మార్వో - ఇతనిపై కలెక్టర్ తప్పక చర్య తీసుకోవాలి.

## విద్యుత్ చౌర్యం కేసులో తెలుగునేత తండ్రి

విద్యుత్ రేట్లు పెంచాక ఆ శాఖ విజిలెన్స్ అధికారులు జిల్లాలో తొలిసారిగా జరిపిన మెరుపుదాడిలో తెలుగుదేశం పార్టీ నేత తండ్రి అరెస్ట్ అయ్యారు. కోవూరు మార్కెటింగ్ కమిటీ ఛైర్మన్ వేమిరెడ్డి పట్టాభిరామిరెడ్డి తన స్వగృహమున్న గండవరంలో విద్యుత్ చౌర్యం చేస్తూ 9తేది విద్యుత్ అధికార్ల దాడిలో దొరికి పోయారు. 31వేల రూపాయల విలువ చేసే విద్యుత్ దొంగతనంగా వాడుకొన్నట్లు అధికారులు తేల్చారు. ఈ కనెక్షన్ పట్టాభిరామిరెడ్డి తండ్రి రాజారామిరెడ్డి పేరిట వుండడంతో ఆయన్ను

తొరువ 8వ పేజీలో

# కరెంట్ సభల్లో 'బాబు'కు తిట్ల షాక్!

విద్యుత్ ఛార్జీల హెచ్చింపుపై నిరసనాగ్రహ జ్వాలలు నెల్లూరు జిల్లాలో తారాస్థాయికి చేరుకున్నాయి. విద్యుత్ ఛార్జీల పెరుగుదలలో సహేతుకతను వివరించి, అక్రమ కనెక్షన్ల క్రమబద్ధీకరణకు ఉద్దేశించిన గ్రామసభలు జిల్లాలో రసాభాసగా మారి పోతున్నాయి. ప్రతి సభలోనూ ప్రజలు, అధికారులను చొక్కాలు పట్టుకొని నిలదీస్తున్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడును మహిళలు రాయడానికి వీలులేని విధంగా, అసభ్య పదజాలంతో దూషిస్తున్నారు. దాదాపు అన్ని గ్రామసభల మినిట్స్ పుస్తకాల్లో, ముఖ్యమంత్రే లక్షా 40వేలు కరెంట్ బిల్లు ఎగ్గొట్టిన విషయాన్ని నమోదు చేయిస్తున్నారు.

ప్రజల ఆగ్రహానికి భయపడి అధికారులు, గ్రామసభలకు పొయ్యేందుకు గడ,గడ వణికి పోతున్నారు. కొన్ని సభల్లో అయితే ప్రజలతోపాటు అధికారులు కూడా విద్యుత్ ఛార్జీల పెంపుకు నిరసనగా నినాదాలు చేసి, కొత్త వరవడి సృష్టించారు. కాంగ్రెస్, వామపక్షాలు గ్రామసభల్లో నిరసన ఉద్యమాలకు బీజం వేసినా, ప్రజాస్పందన ఊహించని విధంగా వెల్లువెత్తి ఉద్యమానికి ఊపిరి పోసింది.

బుధవారం నాడు రాపూరు నియోజకవర్గంలో మరుపూరు, ఉప్పటూరు, తోడేరు గ్రామాల్లో విద్యుత్ శాఖకు చెందిన వాహనాలను ప్రజలు ధ్వంసం చేశారు. గ్రామసభలకు వచ్చిన అధికారులను పొలిమేరల వరకు తరిమి, తరిమి కొట్టారు. ఉప్పటూరు గ్రామంలో విద్యుత్ బిల్లులు కట్టించుకున్న అధికారిని తన్నబోతే, తప్పించుకొని పరుగులు తీసినా, ప్రజలు వదలకుండా వెంటబడి తరిమి, పొలిమేరల్లో పట్టుకున్నారు. తాము కట్టిన డబ్బులను వాపసు తీసుకొని బిల్లు పుస్తకాలను తగులబెట్టారు. నెల్లూరు పట్టణంలో అయితే ప్రతి వార్డులో విద్యుత్ గ్రామసభలు అభాసుపాలవు తున్నాయి. ముఖ్యమంత్రిపై వ్యక్తిగత నిందా ప్రచారానికి వేదికలవు తున్నాయి. గతవారం రోజులుగా విద్యుత్ ఛార్జీల నిరసన ఉద్యమంతో కాంగ్రెస్, వామపక్ష నాయకులు తీరికలేకుండా ఉంటే, తెలుగుదేశం నేతలు మాత్రం, ఎంగిలి విస్తరి కోసం పోట్లాడుకునే కుక్కల మాదిరి కొట్టుకుంటున్నారు. నెల్లూరులో మున్సిపల్ ఛైర్‌పర్సన్ అనూరాధగానీ, మాజీ మంత్రి రమేష్‌రెడ్డిగానీ, 15మంది తెలుగుదేశం కౌన్సిలర్లుగానీ, గ్రామసభల్లో తమ పార్టీ పరువు పాతాళానికి కుంగుతున్నా పట్టించు కోవడం లేదు. పనికి మాలిన మున్సిపల్ కౌన్సిల్ కో ఆప్టెడ్ సభ్యుల ఎన్నికపై ఇరువర్గాలు, ఒకరినొకరు గోతులు తవ్వుకోవడంతోనే కాలం గడిపేశారు. తనను దూరం చేసిన ముఖ్యమంత్రి చంద్రబాబుకు ఈ గతిపట్టాల్సిందేనని, రమేష్‌రెడ్డి తన అనుచరుల వద్ద అక్కసు, వెళ్లబోసు కొంటున్నాడు. అసెంబ్లీ నియోజకవర్గాల్లో అయితే, సర్వేపల్లి, కావలి, సూళ్లూరుపేట, ఉదయగిరి ఎమ్మెల్యేలు ప్రజలకు ఇప్పుడిప్పుడే ముఖం చూపించే సాహసం చేయలేమని బహిరంగంగానే చెబుతున్నారు.

## ప్రజలకు మొహం చూపని జిల్లా తెలుగు నేతలు

కొమ్మి, ఎల్లసిరిలాంటి మాజీ ఎమ్మెల్యేలు, దండాలు, దండకాలు తప్ప పార్టీ గురించి పట్టించుకోవడమే మానేశారు. మొత్తం, విద్యుత్ ఛార్జీల పెరుగుదల, తెలుగుదేశం నాయకులను, ప్రజల వద్దకు పోనీయకుండా అడ్డుకట్టవేసింది.

## పంచాయతీ ఆఫీసుకు తాళం వేసిన ప్రజలు!

మంచినీటి సమస్య విషయమై పట్టించుకోని పాలకుల నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ ప్రజలు పంచాయతీ బోర్డు ఆఫీసుకు తాళాలు వేశారు. కోవూరు గ్రామంలో గత ఇరవై రోజులుగా సురక్షిత మంచినీటి పథకం ద్వారా మంచినీరు సరఫరా కావడం లేదు. ఈ విషయమై ప్రజలు పలు విజ్ఞాపన పత్రాలను పంచాయతీ పాలకవర్గానికి సమర్పించారు. ఫలితం కనపడక పోవడంతో 200 మంది ప్రజలు 22తేది పంచాయతీ కార్యాలయం వద్దకు ఊరేగింపుగా వెళ్లి, నీటి విషయమై కార్యనిర్వహణాధికారి, సర్పంచ్‌ను నిలదీశారు. వారి నుండి సరైన సమాధానం రాకపోయేసరికి ఆగ్రహించిన ప్రజలు పంచాయతీ కార్యాలయంలో పనిచేస్తున్న ఉద్యోగులను బయటకు పంపి ఆఫీసుకు తాళం వేశారు. అక్కడ నుంచి ఊరేగింపుగా మండల పరిషత్ కార్యాలయం వద్దకు వెళ్లి ప్రజలు ఎమ్డీఓ, ఇతర అధికారులను కార్యాలయం నుండి బయటకు వెళ్లి పొమ్మని కోరినప్పుడు వాగ్వివాదం జరిగింది. ఈ సందర్భంగా అక్కడకు వచ్చిన కావలి పంచాయతిరాజ్ శాఖ ఇ.ఇ. వెంకటరెడ్డిని కూడా ప్రజలు నిలదీశారు. 20రోజులుగా ప్రజలు నీళ్లులేకుండా కష్టపడుతుంటే పట్టించుకోని అధికార యంత్రాంగాన్ని ఏమనాలి?

## ఈ బడిని తెరవరా?

ప్రభుత్వ స్కూళ్లు పునః ప్రారంభమై పదిరోజులు గడుస్తున్నా అనుమసముద్రంపేట మండలం రాజేలి గ్రామంలోని ప్రాథమిక పాఠశాల తలుపులు తెరవలేదు. గతంలో ఈ పాఠశాలలో ఇద్దరు ఉపాధ్యాయులు పనిచేసేవారు. ఇటీవల జరిన టీచర్స్ కౌన్సిలింగ్‌లో ఈ ఉపాధ్యాయులు బదలీ అయిపోయారు.

తొరువ 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## ముగ్గురు మంత్రుల ఘెరావ్

నాయుడుపేట, సూళ్లూరుపేటల్లో వివిధ కార్యక్రమాల్లో పాల్గొనను వచ్చిన రాష్ట్ర మంత్రులు కరణం రామచంద్రరావు, కె.పుష్పలత, ఆదాల ప్రభాకరరెడ్డిలను సూళ్లూరుపేటలో కాంగ్రెస్, వామపక్షాల కార్యకర్తలు 22తేది ఘెరావ్ చేశారు. సూళ్లూరుపేట గురుకుల బాలికల పాఠశాల ప్రారంభోత్సవానికి బయలు దేరిన మంత్రులు నిరసనను తప్పించుకొనేందుకు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ప్రతిపక్ష కార్యకర్తలు విద్యుత్ ఛార్జీల పెంపుదల నిలదీసినప్పుడు మంత్రులు స్పష్టమైన సమాధానం చెప్పలేక తరుద్దారు. ముఖ్యమంత్రి దృష్టికి ప్రజల నిరసనను తీసుకెళ్తామని చెప్పి పోలీసుల సహాయంతో ముందుకు వెళ్లిపోగలిగారు. ప్రజా నిరసనను పసిగట్టిన మంత్రులు తమ కార్యక్రమాలనంతటిని మార్చుకొని బదిలో టిఫిన్, చెంగాళమ్మ గుడిలో భోజనం చేశారు. ఈ కార్యక్రమంతటిలోనూ సూళ్లూరుపేట ఎమ్మెల్యే డాక్టర్ పరసా రత్నం ప్రజలచేత చిక్కలేదు. నిలదీయను దొరకక తప్పించుకొన్నారు.

## జిల్లా కలెక్టర్‌తో సోమిరెడ్డి వైరం

జిల్లా కలెక్టర్ శ్రీమతి శ్రీలక్ష్మికి సర్వేపల్లి శాసనసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డికి పొడగిట్టనట్టుంది. దీనివల్లే జిల్లా కలెక్టర్‌ను 22తేది మారుగా విమర్శించారాయన. జిల్లా కలెక్టర్ వేధింపులు భరించలేక జిల్లాలోని వివిధ శాఖల అధికారులు బదిలీలు చేయించుకొని కొందరు సెలవుల మీద వెళ్లిపోయినట్లు వ్యాఖ్యానించారు. చంద్రమోహనరెడ్డి కలెక్టర్ బదలీని కోరుకొన్నట్లుంది. ఆయన వ్యతిరేక వర్గమైన ఆదాల వర్గీయులు దీన్ని అడ్డుకోవడంతో తన వద్దున్న వివిధ అస్త్రాలతో ఆమెపై యుద్ధానికి సిద్ధమైనట్లుంది. మరి దీన్ని కలెక్టర్ ఏ విధంగా ఎదుర్కొంటారో?

## పలకమార్చిన ఘనత నాదే

చింతారెడ్డిపాళెం డొంకలో ఏర్పాటు చేసిన చిన్నపిల్లల పార్కులో శిలాఫలకం మార్చిన ఘనత తనదిగా సర్వేపల్లి శాసనసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి చెప్పుకొన్నారు. తాను ఈ విషయమై పార్టీ కార్యకర్తల సమావేశంలో గట్టిగా మాట్లాడుబట్టే నెల్లూరు ఎమ్మెల్యే రాజేశ్వరమ్మ పేరును జతచేసి కొత్త ఫలకం ఏర్పాటు చేసినట్లు 22తేది తాను ఏర్పాటు చేసిన విలేఖరుల సమావేశంలో చెప్పి ముసిముసి నవ్వులు రువ్వారు. ఈ వ్యవహారంలో తననేదో చేయాలని కొందరు తహతహలాడారని చివరికి వారికి నిరాశే మిగిలిందని చంద్రమోహనరెడ్డి వ్యాఖ్యానించారు. బహుశా ఈ వ్యాఖ్య కూడా ఆయన ప్రత్యర్థి వర్గాన్ని దృష్టిలో పెట్టుకొని చేసినట్లుంది.

## పిల్లల పార్కులో ప్రవేశానికి రుసుం

నెల్లూరులో ఏర్పాటైన చిన్న పిల్లల పార్కు చూసేందుకు ప్రవేశరుసుంగా రెండు రూపాయలను నిర్ణయిస్తూ తీర్మానించారు. 21తేది కలెక్టర్ శ్రీలక్ష్మి అధ్యక్షతన కలెక్టరేట్‌లోని ఆమె ఛాంబర్‌లో జరిగిన పార్కు అభివృద్ధి కమిటీ సమావేశంలో ఈ మేరకు నిర్ణయం తీసుకొన్నారు. ఏడాదిలోపు పిల్లలకు ప్రవేశ రుసుం లేదు. పార్కులో వేకువన 4 గంటల నుంచి 9 గంటల వరకు వాకింగ్ చేయవచ్చు. దీనికిగాను సంవత్సరానికి 500 రూపాయలు, నెలకైతే 50 రూపాయల చొప్పున చెల్లించి గుర్తింపు కార్డులను పొందాలి. స్కేటింగ్ చేసేందుకు నెలకు 30 రూపాయలు చెల్లించాలి. మ్యూజికల్ ఫౌంటెన్ నిర్వహణ కోసం వేలం నిర్వహిస్తారు. వేలంలో పాడుకొన్న వారు దాని బాగోగులు చూసుకొంటూ దీన్ని చూడవచ్చిన వారి నుంచి రుసుం వసూలు చేస్తారు. క్యాంటీన్, ఐస్‌పార్లర్లకు కలిపి రెండేళ్ల కాలానికి వేలం వేస్తారు. పార్కింగ్ స్థలాన్ని వేలం వేసి వాహనాల వద్ద రుసుం వసూలు చేసి పార్కు అభివృద్ధి నిధుల ఖాతాలో జమచేస్తారు. అన్ని ముస్తాబులతో పార్కును జూలై రెండవ వారంలో సందర్శకుల కోసం సిద్ధంగా ఉంచుతారు. ఈ రేట్లు గట్రా చూస్తుంటే చిన్న పిల్లల పార్కుకు కుటుంబ సమేతంగా వెళ్లాలంటే వంద రూపాయల కాగితం మార్చాల్సిందే!

## రాష్ట్రస్థాయి అంధుల క్రికెట్ టోర్నమెంటు

రాష్ట్రస్థాయి అంధుల క్రికెట్ టోర్నమెంట్ 20, 21తేదీల్లో నెల్లూరు వి.ఆర్. కాలేజీ గ్రౌండ్‌లో విజయవంతంగా జరిగింది. నెల్లూరు క్రికెట్ అండ్ స్పోర్ట్స్ అసోసియేషన్ ఫర్ ది బ్లైండ్, రోటరీక్లబ్, రోటరాక్ట్ క్లబ్, చంద్ర యానాదినాయుడు ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్తంగా ఈ పోటీలను ఏర్పాటు చేశాయి. పోటీల్లో తెలంగాణా, ఆంధ్ర రాయలసీమ జట్లుగా అంధ క్రీడాకారులు పాల్గొన్న ఈపోటీల్లో తెలంగాణా జట్టు విజయం సాధించింది. బహుమతి ప్రదానోత్సవ సభలో రోటరీక్లబ్ అధ్యక్షుడు కె. శ్రీహరి, అడ్వకేట్ సదాశివరెడ్డి, కె.వి.డి.వి. ప్రసాదరెడ్డి, డాక్టర్ చంద్ర మధుసూధన్, నెల్లూరులో అంధుల పాఠశాల నిర్వాహకులు శ్రీమతి రాజమ్మ పాల్గొన్నారు. ఈ పోటీలో గెల్చిన తెలంగాణా జట్టు అక్టోబర్‌లో కర్నాటకలో జరిగే సౌత్‌జోన్ పోటీల్లో పాల్గొంటుంది.

## ఏనుగుపట్టాభి రామిరెడ్డి జయంతి

ఏనుగుపట్టాభి రామిరెడ్డి 98వ జయంతి సభ సుబేదారుపేట వద్దగల ఆయన విగ్రహం వద్ద 17తేది అంబేద్కర్ మిషన్ ఛైర్మన్ వి. అరుణాచలం అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా అరుణాచలం మాట్లాడుతూ పట్టాభిరామిరెడ్డి పుణ్యాన ఎందరో దళితుల జీవితాల్లో వెలుగులు ప్రసరించాయని చెప్పారు. ఈ కార్యక్రమంలో పలువురు మిషన్ సభ్యులు పాల్గొన్నారు.

## జర్నలిస్టులపై దాడికి ఖండన

విజయవాడలో మంత్రి వడ్డే శోభనాద్రీశ్వర రావు బసచేసిన స్టేట్ గెస్ట్‌హౌస్ వద్ద విధి నిర్వహణలో వున్న జర్నలిస్టులను, ఫోటోగ్రాఫర్లు, వీడియో గ్రాఫర్లను పోలీసులు విచక్షణా రహితంగా కొట్టడాన్ని ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్ నెల్లూరు జిల్లా శాఖ ఖండించింది. ఈ విషయమై న్యాయవిచారణకు సంఘం కార్యదర్శి జయప్రకాష్, కోశాధికారి అల్లూరు రహీం డిమాండ్ చేశారు.

## రేడియోలో రాళ్లపల్లి కుటుంబ ఉపన్యాసాలు

తహసీల్దార్ రాళ్లపల్లి రామసుబ్బారావు, ఆయన కుమారుడు ఉపేంద్ర చేసిన ఉపన్యాసాలను ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రసారం చేస్తుంది. ఉపాధికల్పనలో హోటల్ పరిశ్రమ అనే అంశంపై రాళ్లపల్లి ఉపేంద్ర చేసిన ఉపన్యాసం జూలై 3తేది మధ్యాహ్నం 12.40 నిమిషాలకు కార్మికుల కార్యక్రమంలో ప్రసారమవుతుంది. రామసుబ్బారావు 'సుఖమయ జీవితానికి పొదుపు' అనే అంశంపై చేసిన ఉపన్యాసం జూలై 6తేది మధ్యాహ్నం 12.40 నిమిషాలకు కార్మికుల కార్యక్రమంలో ప్రసారమవుతుంది. ఏది ఏమైనా ఆకాశవాణి విజయవాడ కేంద్రం ద్వారా నెల్లూరీయుల ప్రసంగాలు ఎక్కువయ్యాయి.

## సాహిత్యసదస్సు సాహిత్య పంచమి

నెల్లూరులోని సాహిత్య సదస్సు, సాహిత్య పంచమి పేరిట ఆధ్యాత్మిక సాహిత్యోపన్యాసాలను జూన్ 26తేది నుంచి 30తేది వరకు టౌన్‌హాల్‌లో నిర్వహిస్తుంది. తొలిరోజు సభను మాజీ ఉపలోకాయుక్త మేనకూరు మోహనరామిరెడ్డి ప్రారంభిస్తారు. 26తేది ప్రొఫెసర్ జి.వలపతి భాగవతంపై, 27తేది జి. దామోదరనాయుడు మహాభారతంపై, 28తేది డాక్టర్ సి. గోవిందరాజు అన్నమయ్య సాహిత్యంపై, 29తేది శ్రీమతి సి. వసుంధర కవితావైభవంపై, 30తేది ప్రొఫెసర్ రఘునాధాచార్య వాల్మీకి రామాయణ ప్రాశస్త్యాన్ని వివరిస్తారు. సాహిత్య అభిమానులను ఈ కార్యక్రమాలకు తరలి రమ్మంటున్నారు సదస్సు కార్యదర్శి స్వయంపాకుల శ్రీనివాసులు.



వేదం వెంకటరాయశాస్త్రి జయంతి సభలో డాక్టర్ చీమకుర్తి వెంకటేశ్వర రావును సన్మానిస్తున్న వేదం వెంకటరామన్. ప్రక్కన పొన్నాల రామసుబ్బారెడ్డి, ధర్మారెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి వున్నారు.

## వేదంవారి జయంతి

వర్ధమాన సమాజం నేతృత్వంలో 15తేది టౌన్ హాల్‌లో వేదం వేంకటరాయశాస్త్రి 147వ జయంతి సభ జరిగింది. నాయుడుపేట జూనియర్ కాలేజి తెలుగు లెక్చరర్ డాక్టర్ చీమకుర్తి వెంకటేశ్వరరావు 'శాస్త్రిగారి నాటకాలు-పాత్రోచిత భాష'అనే అంశంపై మాట్లాడారు. శాస్త్రిగారు సమాజాన్ని నిశితంగా పరిశీలించిన వారు కావడం చేత తమ స్వతంత్ర నాటకాలలో ఆయా పాత్రల కనుగుణమైన భాషను అత్యద్భుతంగా వాడారు. సంస్కృత నాటకాలలోని పాత్రోచిత భాషను తెలుగులో కూడ ప్రవేశపెట్టిన ఘనత శాస్త్రిదేనన్నారు. ప్రతాపరుద్రమ, బొబ్బిలి, ఉషా నాటకాలలో శాస్త్రి ప్రయోగించిన రమ్య రమణీయమైన పాత్రోచిత భాషా విధానాన్ని విశ్లేషించి సభా పోషకులు వేదం వేంకటరామన్ ద్వారా సన్మానం పొందారు. సమాజాధ్యక్షులు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి శాస్త్రిగారి జయంతి సభ పూర్వాపరాలను విశదీకరించి, వక్తను సభకు పరిచయం చేయగా, కార్యదర్శి పొన్నాల రామసుబ్బారెడ్డి వందన సమర్పణ కావించారు.

## ఎపిఆర్ జెసిలో నెల్లూరు విద్యార్థుల ప్రతిభ

ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీల్లో ప్రవేశం కోసం నిర్వహించిన ప్రవేశ పరీక్షల్లో పలువురు నెల్లూరు విద్యార్థులు యూనివర్సిటీ పరిధిలో ర్యాంకుల మోత మోగించారు. పెదతాపోలూరు రత్నం హైస్కూల్‌లో టెన్త్ చదివిన ఎం.వి.ఆర్.రాకేష్, ఆర్.శిల్ప 1ర్యాంకును, యు.యుగేంద్ర, ఎస్.నవ్య 3వర్యాంకును, టి.లక్ష్మిదీపక్ 6వర్యాంకును, టి.శ్వేత 7వర్యాంకును సాధించారు. అయితే ఈ విద్యార్థులంతా ఎపిఆర్‌జెసిలో చేరాలని అనుకోవడం లేదు. రత్నం కోచింగ్ సెంటర్‌లోనే జూనియర్ ఇంటర్ చదవాలని నిర్ణయించుకొన్నట్లు చెప్పారు. ర్యాంకర్ల నిర్ణయానికి రత్నం సంస్థ డైరెక్టర్ కె.వి.రత్నం ఆనందాన్ని వ్యక్తం చేసారు.

టౌన్‌లోని ఎవరెస్ట్ ఇంగ్లీషు మీడియం హైస్కూల్‌లో చదివిన అల్కాజైన్ ఎపిఆర్‌జెసిలోనే రెండవ ర్యాంకును, సి.హెచ్.కల్పన 55వర్యాంకును సాధించారు. గతఏడాది తమ హైస్కూల్‌లో చదివిన విద్యార్థి లక్ష్మణరావు 5వర్యాంకు తెచ్చుకొంటే, ఈ యేడాది అల్కాజైన్ 2వర్యాంకును తెచ్చుకోవడం పట్ల కరస్పాండెంట్ కె. రామారావు ఆనందాన్ని వ్యక్తం చేసారు. అల్కాజైన్‌కు రత్నం కోచింగ్ సెంటర్‌లో ఉచిత విద్య చెప్పిస్తానని డైరెక్టర్ కెవి.

కొరవ 7వ పేజీలో

# నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

రత్నం హామీ ఇచ్చినట్లు రామారావు చెప్పారు.

## మిలీనియం అచీవర్‌కు సన్మానం

మిలీనియమ్ అచీవర్ 2000 అవార్డు విజేత ఎమ్వీ రమణయ్యను ఎపి స్టేట్ గవర్నమెంట్ రిటైర్డ్ ఎంప్లాయిస్ అసోసియేషన్ 22తేది ఏఆర్ కళాశాలలో ఏర్పాటుచేసిన కార్యక్రమంలో సన్మానించింది. అసోసియేషన్ అధ్యక్షులు పి. జితేంద్రనాథ్‌బాబు ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

## జర్నలిస్టులకు కంప్యూటర్ శిక్షణ

ఎపియూడబ్ల్యుజె జిల్లాశాఖ, ఎపి ప్రెస్ అకాడమి సంయుక్తంగా జిల్లాలోని జర్నలిస్టులకు 10 రోజులపాటు ఉచిత కంప్యూటర్ శిక్షణ ఇవ్వతలపెట్టాయి. ఆసక్తిగలవారు తమ పేర్లను 27తేదిలోగా జిల్లా కార్యదర్శి, ఎపియూడబ్ల్యుజె, జార్జిపేట, కపాడిపాళెం, నెల్లూరు-1 చిరునామాకు పంపాలి.

## ఆర్యవైశ్య సంఘం రజతోత్సవం

నెల్లూరుజిల్లా ఆర్యవైశ్య సంఘం రజతోత్సవ వేడుకలు జూన్ 25తేదీ కస్తూరిబా కళాక్షేత్రంలో జరుగుతాయి. వేడుకలను న్యాయశాఖ మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ప్రారంభిస్తారు. ప్రముఖ ఆర్యవైశ్య నాయకులు గంజి రాజమౌళిగుప్త, కొణిజేటి రోశయ్య, జిల్లా ఎస్పీ సివి. నరసయ్య, కారంశెట్టి వెంకట్రామయ్యతో పాటు పందల మంది ఆర్యవైశ్య నాయకులు పాల్గొంటారు. ఈ సందర్భంగా సభ - సన్మానాలు - తీర్మానాలు జరుగుతాయి. వీటిని పైవారం ముద్రించిద్దాం.

## పట్టపగలు హత్య

నెల్లూరు పెద్దాసుపత్రి వద్ద 19తేది పట్టపగలు ప్రజల మధ్య జరిగిన హత్య టౌన్‌లో సంచలనం సృష్టించింది. కొడవలూరు మండలం వెంకన్నపురంలో గౌరకులస్తులకు, యాదవులకు విరోధాలున్నాయి. గౌరకులస్తుల నాయకుడు హతుడు మీరయ్య. అయన ప్రత్యర్థి వర్గానికి చెందిన శంకరయ్యను మీరయ్య వర్గీయులు హత్య చేశారు. అప్పటి నుంచి శంకరయ్య వర్గీయులు మీరయ్య హత్య చేయను అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. మీరయ్య భార్య పద్మ పెద్దాసుపత్రిలో బాగోలేక చేరడంతో నిత్యం వస్తున్న అతడ్ని కాపుకాసి 19తేది కిరాతకంగా నరికి తాపీగా కొండాయపాళెం గేటు మీదుగా నడిచి వెళ్లిపోయారు. ఈ హత్యను పందల మంది కళ్లచూశారు. కేసును టౌన్ సిఐ రమణరావు దర్యాప్తు చేస్తున్నారు.

## జడ్పీ సిఇఓ

జిల్లా పరిషత్ ముఖ్య కార్యనిర్వహణాధికారిగా సి. వెంకటేశ్వరరావు నియమితులయ్యారు. ఈయన గుంటూరు సిఇఓగా పనిచేస్తూ ఇక్కడకు బదలీ అయ్యారు. వెంకటేశ్వరరావు నెల్లూరుకు పాతవారే. డిప్యూటీ సిఇఓ, జిల్లా పంచాయతి అధికారిగా గతంలో ఇక్కడ పనిచేశారు.

## విజయభాస్కరరెడ్డి హైదరాబాద్ బదలీ

నెల్లూరు వన్ టౌన్ ఎస్ఐగా పనిచేస్తూ నెల్లూరు ట్రాఫిక్ నార్త్ విభాగానికి బదలీ అయిన విజయభాస్కరరెడ్డిని ఇక్కడ నుండి హైదరాబాద్‌లోని ట్రాన్స్‌కో విభాగంలో సబ్ ఇన్స్‌పెక్టర్‌గా మార్చారు. రాష్ట్ర పోలీసు అధికారుల సంఘం ప్రధానకార్యదర్శిగా పదవీ బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించేందుకు విజయభాస్కరరెడ్డిని ప్రత్యేకంగా హైదరాబాద్‌కు మార్చారు.

## జిల్లా పంచాయతీ అధికారి బదలీ

చలాకిగా, చురుకుగా తన పదవీ బాధ్యతలు నిర్వహిస్తుండిన జిల్లా పంచాయతి అధికారి సత్యశ్రీనివాస్‌ను విజయనగరంకు బదలీ చేశారు. అక్కడ జిల్లా పంచాయతి అధికారిగా పనిచేస్తున్న సుబ్రహ్మణ్యంను ఇక్కడ నియమించారు.

## స్వచ్ఛంద పదవీ విరమణ

నెల్లూరు ప్రభుత్వాసుపత్రిలో సివిల్ సర్జన్‌గా పనిచేస్తుండిన డాక్టర్ ఎ.ఎస్.రెడ్డి 12తేది స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. కొద్ది రోజుల్లో స్వగ్రామమైన కాకుపల్లిలో తన తల్లి ఆరుగుంట కమలమ్మ పేరుతో ఉచిత వైద్యశాల నడుపుతానని ప్రకటించారు. మంచి నిర్ణయం తీసుకొన్న డాక్టర్‌కు మా అభినందనలు.

పెంచిన విద్యుత్ ఛార్జీలను వ్యతిరేకిస్తూ విసనకర్రలతో నిరసన ప్రదర్శన చేసిన యువజన కాంగ్రెస్ ర్యాలీలో ప్రసంగిస్తున్న జె.కె. రెడ్డి, ప్రక్కన ప్రవీణ్‌కుమార్ రెడ్డి, సిది శేషారెడ్డి.

## నిజం

మొదటి పేజీ కొరవ

కరెంట్ విషయంలో తాను ప్రతి రోజా సమీక్ష జరుపుతున్నానని, అమెరికాలో వున్నప్పుడు కూడా తను చెప్పిన ప్రకారమే కరెంట్ సరఫరా జరిగిందని చెప్పుకునే ముఖ్యమంత్రి, ఇంతకాలం ఈ చోరీ సమస్యను ఎందుకు పట్టించుకోలేదు? ఇప్పుడైనా కేవలం చోరీ వల్లనే సమస్య అయితే, వాటిని నివారించడానికి ప్రయత్నించాలి తప్ప, ధరలు పెంచడం దేనికి?

అది పోనిండి, అసలు ప్రభుత్వం చెప్పే మేర దొంగతనాలు, నష్టాలు వున్నాయా అన్నది ఇప్పటి సమస్య. ట్రాన్స్‌కోకు వస్తున్న రాబడి ఎంత, కేటగిరి వారీగా గృహవినియోగం ఎంత, వ్యవసాయం ఎంత, పరిశ్రమలకు ఎంత అన్న విషయంలో ప్రభుత్వం నిజం చెప్తే, ఇంత సందేహం రాదు. కాని వారు నిజం మాత్రం పలకడం లేదు.

ఇప్పటికి ప్రభుత్వ, ప్రతిపక్ష ట్రాన్స్‌కో లెక్కలతో తికమకపడుతున్న ప్రజలకు, విద్యుత్ సంస్థ ఇంజనీర్లు ఇప్పుడు మరొక కొత్త లెక్క వినిపిస్తున్నారు. వీరి అంచనా ప్రకారం వ్యవసాయ వినియోగం కేవలం 3600 మిలియన్ యూనిట్లు, ట్రాన్స్‌కో చెప్పే సంఖ్య 9815 మిలియన్ యూనిట్లు. రెండింటికి తేడా ఎంతో చూడండి. ఇంజనీర్ల సంఘం లెక్క ప్రకారం వ్యవసాయ రంగానికి ఉచితంగా కరెంట్ ఇచ్చినా సంస్థకు పెద్ద నష్టం రాదు. సంస్థలో పనిచేసే ఇంజనీర్ల లెక్కకు, అదే సంస్థ వున్నతాధికార్ల లెక్కకు ఇంత తేడా ఎందువల్ల?

ఇంకొక ప్రక్క ఇతర రాష్ట్రాలలో కరెంట్ ఛార్జీల విషయంలోను ప్రభుత్వ, ప్రతిపక్షాల వారు ప్రజలను అయోమయంలో పడవేస్తున్నారు. పశ్చిమబెంగాల్‌లో కరెంట్ గణాంకాలపై సిపిఎం, తెలుగుదేశం పార్టీల మధ్య పెద్ద రగడ జరుగుతున్నది.

ఇది చాలా దురదృష్టకర పరిణామం. ప్రభుత్వం ప్రజలకు అబద్ధాలు చెప్పడం కంటే నేరం ఇంకొకటి వుండదు. చంద్రబాబు నాయుడు ఇప్పటికైనా తన తప్పు సవరించుకొని, నిజాయితీగా కరెంట్ విషయంలో వాస్తవాలు వెల్లడించి, ప్రజల మద్దతు కోరడం, ఆయన రాజకీయానికే మంచిది. ఎల్లకాలం ప్రజలను మోసగించి పరిపాలన చేయలేరు. నిజాలు దాచి పెట్టడం కూడా అన్ని సమయాలలో సాధ్యంకాదు. ప్రభుత్వం చెప్పేది తప్పుడు సమాచారమన్న అభిప్రాయం ప్రజలలో ఏర్పడితే, ఆ తర్వాత నిజం చెప్పినా నమ్మరు.*

## సీనియర్ సివిల్ జడ్జి (సబ్ కోర్టు) వారి కోర్టు, నెల్లూరు

E.P.No. 31/1997 O.S. No. 42/1986

Between:

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ముత్తుకూరు బ్రాంచి - డిక్రీహోల్డరు / వాది

And

ఈదూరు రామకృష్ణారెడ్డి - జె.డి.ఆర్. / ప్రతివాది

### స్థిరాస్తి వేలము ప్రకటన

ఇందుమూలముగా తెలియజేయడమేమనగా పై నంబరు వాది రూ.3,59,487.95 పైలు డిక్రీ దరిమిల్లా వడ్డీ ఖర్చులు రాబట్టు నిమిత్తమై క్రింద షెడ్యూలు దాఖలా ఆస్తులను బహిరంగముగా వేలము వేసి వేలములో వచ్చిన మొత్తము డిక్రీ బాకీలోనికి జమ చేయవలసినదిగా కోరుచూ పై కోర్టులో E.P. No. 31/1997 అమలు దరఖాస్తు దాఖలు చేసియున్నారు.

ఈ క్రింద కనుబరచిన షెడ్యూలు దాఖలా ఆస్తులను కోర్టువారు నెల్లూరు సీనియర్ సివిల్ జడ్జి వారి కోర్టులో 5.7.2000 తేదిన పై కోర్టు ఆవరణములో ఉదయం 10.30 గంటలకు బహిరంగముగా, వేలము వేయబడును. వేలములో పాల్గొనదలచిన వారు 5.7.2000 తేదిన ఉదయం 10.30 గంటలకు హాజరై పాల్గొనవచ్చును.

**SCHEDULE**

Land belonging to the defendant situated in Muthukur Village, Nellore Taluk (now Muthukur Mandal), Nellore District.

1. S.No. 314/3, measuring Ac. 0.75 wet out of 1.80 wet bounded on the EAST : Donka; SOUTH : Dharanikota Audi Lakshmi's land; WEST : Irrigation channel; NORTH : Nellore - Krishnapatnam road within the same boundaries Ac. 0.75 wet value about Rs.6,000/-
   DHR Value : Rs. 6,000/- Amin Value : Rs.15,000/-
2. S.No. 345 measuring Ac. 0.35 wet out of Ac. 8.53 wet bounded on the EAST : Bommidi Chinnaiah's land; SOUTH : Muthukuru Anjaneya Swamy's temple land; WEST : Buduru Pitchaiah's land and irrigation channel; NORTH : Irrigaiton channel within the said boundaries Ac.0.35 wet, value about Rs.2,800/-
   DHR Value : Rs.2,800/- Amin Value : Rs.7,000/-
3. S.No. 344 measuring Ac. 1.85
   S.No. 342/5 ,, Ac. 2.00
   S.No. 345 ,, Ac. 8.53
   Total Extent ... Ac.12.38 out of this Ac.6.51 wet bounded on the EAST : Land of Kethireddy Somaiah to some extent; Sk. Kalesha's land to some extent Buduru Chinnaiah's lands; SOUTH, WEST & NORTH : Irrigation channel within the said boundaries Ac. 6.51 wet value about Rs.52,080/-
   DHR Value : Rs. 52,080/- Amin Value : Rs. 1,30,200/-
4. S.No. 306/2; Ac.5.26 full no. wet
   DHR Value : Rs. 42,000/- Amin Value : Rs. 1,05,200/-
5. S.No. 544; measuring Ac. 13.50
6. S.No. 545; measuring Ac. 14.32
   Total Extent ... Ac. 27.62 out of this Ac.6.00, dry land bounded on the EAST : Donka; SOUTH : Land of Dodla Seshaiah and others; WEST : Vallapalem Papireddy's land; NORTH : Lands belonging to Thandeva Veeraswamy and Thiruvalluru Ramaiah
   DHR Value : Rs. 15,000/- Amin Value : Rs. 60,000/-

Total Value : Rs. 1,17,880/-

**M. GOPALACHARI**, Advocate, Nellore

Padmavathi Ads, Nlr.

# ఎగుడు దిగుడు వాస్తుతో ఏకామ్రేశ్వరుడి వడిదుడుకులు!

శ్రీ స్వరూపాలు, దేవతలలో భిన్నలు. మధుర మీనాక్షి, కంచి కామాక్షి అటువంటి దేవతల పరిధిలోనికి వస్తారు.

కంచి 'ఏకామ్రేశ్వరుడు' కంచి కామాక్షి నాథుడు. ఊరి మధ్యలో నెలకొన్న భక్తుల కొంగుబంగారం. ఈ ఆలయం విష్ణుకంచిలోని వరదరాజస్వామి ఆలయం కంటే ప్రాచీనమైనది.

ఆలయంలోని పల్లవ, చోళ, తెలుగు చోళ, విజయనగర శాసనాలు ఈ అంశానికి బలాన్ని చేకూరుస్తున్నాయి. శైవ, వైష్ణవాల మధ్య విభేదాలు మితిమీరిన కాలంలో శైవ, వైష్ణవ రాజ్యాధిపతుల మధ్య మహాసంగ్రామాలు జరిగాయి.

ఆ యుద్ధాలకు కంచి (కాంజీవరం) తిరుపతి మూలస్థానాలైనాయి. ఆ యుద్ధాలలో రక్తపు టేరులు పారినట్లు చారిత్రకులు చెబుతారు. ఆలయంలో చోళ ప్రభువుల పలు శాసనాల్ని బట్టి ఆలయంలో అనేక మార్లు

## వాస్తుసంగతులు
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

పునర్నిర్మాణాలు జరిగాయని తెలుస్తున్నది. పూర్వం ఆమ్రవృక్షం క్రింద శివలింగం పూజలందుకునేదని అందువల్ల ఇక్కడి శివుడు ఏకామ్రనాథుడయ్యాడని చెబుతారు.

### ఆలయవర్ణన

ఆలయం వరదరాజస్వామి అంత పెద్దదికాక పోయినప్పటికీ పటిష్టమైన నిర్మాణాలతో, ఉత్తుంగ శిఖరాలతో, ఉన్నత ప్రాకారాలతో సమున్నతంగా వుంటుంది. ఆలయ గోపుర ద్వారం వద్దనున్న 'ఏనుగువిల్ల' స్వాగతాలు ఓ ప్రత్యేక ఆకర్షణ.

సమున్నతమైన గోపురం, ఆలయాన్ని పరివేష్టించివున్న ప్రాకారం శివుడికి వాస్తుభద్రతను కల్పించాయి.

ఆలయం తూర్పు దిశాభిముఖంగా వుంది. శివుడు తూర్పు ఇంద్రస్థానాన్ని గౌరవిస్తూ సమున్నతస్థితిలో 'అధిష్టానాన్ని' అధిష్టించి వున్నాడు. ఎదురుగా 'నంది' సవినయంగా నమస్కృతుడై వున్నాడు.

### ఆలయంలో సలక్షణ వాస్తు

ప్రాకారాలు, లోగిళ్లలో పరిచిన రాతి బండల మధ్య గడ్డి పిచ్చి మొక్కలు మొలచినా దాదాపు 1000 సంవత్సరాలు పాటు పూర్వవైభవంతో పరిఢవిల్లుతున్న ఈ ఆలయానికి ఎక్కువ పాళ్లలో వున్న సలక్షణ వాస్తు కారణం. గోపురం ప్రవేశం దక్షిణ దిశాభిముఖంగా వున్నప్పటికీ ఏకామ్రనాథుడు తూర్పు దిశాభిముఖంగా వుండటం వల్ల తూర్పు ఇంద్రస్థానం ఆర్ద్రత, ఆలయానికి ప్రాప్తించింది.

బలిపీఠం, ధ్వజస్తంభం, ముఖమండపం, మహామండపాలు, అంతరాళం, గర్భగృహం ఆగమ శాస్త్రానుగుణంగా అమరడం వల్ల చోళరాజుల నుంచి మధుర నాయక రాజుల వరకూ అనేక దానశాసనాల్ని పొందింది ఆలయం. పశ్చిమస్థానంలో సమున్నతంగా శివుడు 'పానవట్టం' అధిష్టించి తూర్పు ముఖాభిముఖంగా దర్శనం ఇవ్వబట్టి 'పశ్చిమం ఉన్నతమై వాస్తు సూక్తి బలం చేకూరింది.

### కోనేరు

తూర్పు, ఉత్తర దిశామధ్యస్థ స్థలిలో అమరి కోనేరు స్థానం 'నిర్మాణ ఈశాన్యం' అయింది. ఈశాన్యం 'ఈశు'ని స్థానం అందువల్ల ఎనలేని వాస్తు గరిమ, పటిమ ఆలయానికి అబ్బాయి. అందువల్ల కొన్ని ఆలయంలో వాస్తు వక్రతలున్నప్పటికీ ఆలయం పూర్వపు ఔన్నత్యాన్ని తిరిగి పొందుతూ వుంది.

### ఆలయం అవాస్తు

ప్రాకారం నిర్మాణంలోని హెచ్చు తగ్గులు స్వామివారికి కొంత కాలం పాటు 'తెరను' దించాయి.

తూర్పు, ఉత్తరాల్లో ప్రహరీ నానుకొని నిర్మించిన ప్రదక్షిణ మండపాలు తూర్పు, ఉత్తరాల్ని 'బరువు' చేశాయి.

ఆలయ వివాదాలకు వాయువ్య దోషాలు, కూడా తోడైనాయి. ప్రహరీ అంతర్భాగంలోని 'నైరుతి' నిర్మాణాలు లేక ఖాళీగా వుండటం వల్ల 'నిరుతి' (రాక్షస) స్థానం విజృంభించి ఆలయానికి అభివృద్ధికి ఎన్నెన్ని అవాంతరాలు కల్పించాలో అన్ని అవాంతరాలు కల్పించింది.

అయినప్పటికీ కోనేరు కలిగి ఈశాన్య స్థానం వాస్తు మహాబలోపేతమైనది కాబట్టి ఆ అవాంతరాలను అధిగమించి ఆలయం పూర్వవైభవానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. తమిళనాడు రాష్ట్ర ప్రభుత్వానికి 'దైవం'పై నమ్మకం లేకపోవడం వల్ల అక్కడి దేవాదాయ శాఖ బలహీనమై పోయింది. నిధులు కరువైనాయి. ఆలయ దేవతలు, భక్తులపైనే ఆధారపడ వలసిన స్థితి ఏర్పడింది. •

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

అరెస్టు చేసి 14తేది కోవూరు కోర్టులో హాజరుపర్చారు. మేజిస్ట్రేట్ శ్రీమతి శాంత, రాజారాంరెడ్డికి 14 రోజులపాటు రిమాండ్‌కు ఆదేశించడంతో పోలీసులు ఆయనను జిల్లా జైలుకు తరలించారు. కోవూరు మార్కెటింగ్ ఛైర్మన్ పట్టాభిరామిరెడ్డి ఎమ్మెల్యే ప్రసన్నకుమార్ రెడ్డికి కుడిభుజం వంటివారు.

### శిస్తు వసూళ్లకై వత్తిడి

జిల్లాలో 46 మండలాలను కరవు ప్రాంతాలుగా ప్రకటించినా ఆత్మకూరు నియోజక వర్గ పరిధిలో గల మండలాల్లోని వి.ఏ.ఓ.లు భూమిశిస్తు కట్టాలని నానాయాగీ చేస్తున్నారు. నియోజకవర్గ పరిధిలోని ఆత్మకూరు, అనంతసాగరం, ఎ.ఎస్.పేట మండలాలకు దగ్గరగా సోమశిల ప్రాజెక్ట్ ప్రక్కనే వున్నా తొలికారును కూడా రైతులు పండించు కోలేక పోయారు. ఈ దశలో పశువులకు మేత కూడా లేక కబేళాలకు అమ్మేస్తుంటే వి.ఏ.ఓ.లు భూమిశిస్తు కట్టాలని వత్తిడి చేస్తున్నట్లు రైతులు వాపోతున్నారు. కరవు మండలాలుగా ప్రకటించాక గూడా ఇదేమిటని ప్రశ్నిస్తే అర్జీ శిస్తు వసూళ్లు చేయకపోతే తమ మీద చర్యలు తీసుకొంటానని హెచ్చరించడం వల్ల తాము వత్తిడి చేయలేక తప్పడం లేదంటున్నారట. పంటలు పండని ఈ కాలంలో రైతులు శిస్తులు ఎక్కడ నుంచి తెచ్చి కడతారు కలెక్టరుగారు! ఈ విషయాన్ని మీరు పరిశీలించండి.

### ఆక్రమణలపాలైన కోడూరు చెరువు

ఆరు వేల ఎకరాల ఆయకట్టుగల కోడూరు - ఈదూరు చెరువులో 400 ఎకరాల. మేర ఆక్రమణల పాలయ్యింది. చెరువు దురాక్రమించిన వార్లు నివ్వంగా ఎకరాకు మూడు పుట్లు పండించుకోవడంతో పాటు, విద్యుత్ కనెక్షన్లు సైతం సులభంగా సంపాదించారు. మాచర్లవారిపాలెం, ఈదూరు, సోతంముదూరు మోతుబరి రైతులు ఏకంగా రొయ్యలు, చేపల సాగు చేపట్టారు. వేలాది రూపాయలు పెట్టుబడులు పెట్టి పట్టా పొలాల్లో సేద్యం చేసే రైతులకు చెరువు నీరు అందక అతలాకుతలమౌతుంటే, ఆక్రమదారులు హాయిగా మామూలు చేసుకొంటున్నారు. ఒకవారు చేసుకొని బయటకు వస్తారనుకొంటే చెరువు అరగాణితో సహా ఆక్రమించి మేతకువెళ్లే పశువులను, చివరకు బట్టలుతికే రజలకులకు సైతం ఇబ్బంది కల్గిస్తున్నారు. చెరువును ఆక్రమించిన వాళ్లు వారి అబ్బసొత్తన్నట్లు అమ్ముకొంటుంటే గ్రామాధికార్లు చోద్యం చూస్తున్నారు. కోడూరు చెరువులో 20 సంవత్సరాల క్రితం ఒక విద్యుత్ హెల్పర్ ఏకంగా ఒక ట్రాన్స్‌ఫారం పెట్టి సేద్యం చేసి అందరికీ దారి చూపించాడు. ఆ తర్వాత ఎకరా 20 వేల నుంచి 30వేల వరకు ధరపలికింది. చంద్రమోహన్‌రెడ్డి మంత్రిగా వున్నప్పుడు రైతులు కదలి వచ్చి నూతిస్తే రిజర్వాయరు చేయిస్తానని ఎస్టిమేట్లు వేయించినా ఫలితం కానరాలేదు. ఇటీవల పట్టాదారులంతా చెరువు ఆక్రమణలపై జిల్లా కలెక్టర్‌ను కలసి వాటిని తొలగించకుంటే శిస్తులు కట్టకుండా సహాయ నిరాకరణ చేస్తామన్నారు. అన్ని పార్టీలు ఈ వ్యవహారానికి మద్దతిస్తున్నాయి. కలెక్టర్‌గారి స్పందనే ఇక తరువాయి.

### మండల కార్యాలయాల్లో గాలి చేష్టలు

ఇందుకూరుపేట, తోటపల్లిగూడూరు మండల రెవిన్యూ కార్యాలయాలు, సబ్‌రిజిష్ట్రార్ ఆఫీసుల్లో గాలిచేష్టలు జోరుగా వున్నాయి. ఎమ్మార్వోలు, సబ్‌రిజిష్ట్రార్ల పేరు చెప్పి క్రింది సిబ్బంది చేతులు వాస్తున్నారు. ఇక్కడ పనిచేసే స్టాక్‌పాయింట్ డిప్యూటీ తహసిల్దార్ డీలర్ల జేబుల్లో పైసలతో సహా గుంజేస్తున్నారని పుకార్గా వుంది. మారిపోయిన తోటపల్లిగూడురు ఎమ్మార్వోను ఇదే వ్యవహారంలో బదలీ చేసినట్లు తెలిసింది. గాలిచేష్టలకు వేప మండె వేసేవాళ్లు లేకపోవడంతో వీరికి అడ్డు ఆపులేకుండా పోయింది.

### నరుకూరు సెంటర్‌లో రాస్తారోకో

విద్యుత్ ఛార్జీల పెంపుదలను వ్యతిరేకిస్తూ కాంగ్రెస్, సిపిఎం సంయుక్తంగా నరుకూరు సెంటర్లో ఇటీవల రాస్తారోకో నిర్వహించారు. డిసిసి అధ్యక్షుడు సి.వి. శేషారెడ్డి హుషారుగా నలుగురిని పోగుచేయడంతో ఈ కార్యక్రమం బ్రహ్మాండంగా జరిగింది. కాంగ్రెస్ నాయకులు జెన్నర్ల వారగోపాల్, విజయసేనారెడ్డి వెంకయ్యనాయుడు, సిపిఎం నాయకులు జి. రమణయ్య, కోదండరామిరెడ్డి, నశీం, ఆంజనేయులు ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించారు.

### మండల ఉద్యోగులకు జీతాలు లేవు

వెంకటగిరి మండల ప్రజాపరిషత్ ఉద్యోగులకు గత నాలుగు నెలలుగా జీతాలు చెల్లించడం లేదు. జీతాల పద్దుకు నిధులు విడుదల కాకపోవడం వల్ల ఈ దుస్థితి దాపురించింది. జిల్లాలోని కొన్ని మండల పరిషత్ ఉద్యోగులకు కూడా గత నాలుగు జీతాలు లేనట్లు తెలిసింది.

అంధుల క్రికెట్ టోర్నమెంట్‌ను పురస్కరించుకొని ఏర్పాటైన సభలో మాట్లాడుతున్న అంధుల అసోసియేషన్ కార్యదర్శి మన్‌మోహన్‌రెడ్డి, కూర్చొన్నవారిలో నెల్లూరు నార్త్ రోటరీక్లబ్ అధ్యక్షులు కె. శ్రీహరి, వికలాంగుల సంక్షేమశాఖ ఉపసంచాలకురాలు వాణి, కోచ్ చంద్రశేఖర్, నిలబడి వున్నది అంధులపాఠశాల నిర్వాహకురాలు రాజమ్మ

### వెంకటగిరిలో ఎమ్పీ హడావుడి పర్యటన

తిరుపతి ఎమ్పీ డాక్టర్ వెంకటస్వామి 19తేది వెంకటగిరి నియోజకవర్గంలో హడావుడిగా పర్యటించారు. టౌన్‌లోని గురుకుల పాఠశాల, కళాశాల, డిగ్రీ పాఠశాలను తొలుత సందర్శించారు. అనంతరం ఇంకుడు గుంటలు త్రవ్వి, మొక్కలు నాటి, వివిధ పనులకు శంకుస్థాపనలు చేశారు. బసపాళెం, శింగమాంబపురం, అగ్రహారం వెళ్లి ఆ గ్రామాలలో అనేక మంది బిజెపిలో చేరినట్లు ప్రకటించారు. మధ్యలో విలేఖరులతో మాట్లాడుతూ రాయలసీమ, నెల్లూరు జిల్లాలోని మెట్ట ప్రాంతాల్లోని పురాతన కాలం నాటి చెరువులు ఎటువంటి అభివృద్ధికి నోచుకోవడం లేదని ఇటీవల తిరుపతి వచ్చిన ప్రధాని దృష్టికి తీసుకెళ్లినట్లు చెప్పారు. తిరుపతి లోక్‌సభ నియోజకవర్గ పరిధిలో 4.50కోట్ల రూపాయలతో ప్రగతి పనులు జరుగుతున్నాయని, వెంకటగిరి అసెంబ్లీ సెగ్మెంట్‌లో 57.30లక్షలతో ఈ పనులు వేగవంతంగా చేస్తున్నట్లు చెప్పారు. ఇక్కడి నిమ్మరైతుల సమస్యలను రైల్వే జనరల్ మేనేజర్‌తో చర్చించానని, మద్రాసు - సూళ్లూరుపేటల మధ్య నడిచే లోకల్ రైలును నెల్లూరు వరకు పొడిగించే ప్రయత్నం చేస్తున్నట్లు చెప్పారు.

### వెంకటగిరిలో విద్యుత్ సదస్సులే జరగలేదు

వెంకటగిరి నియోజక వర్గంలో విద్యుత్ సదస్సులకు ప్రతిగ్రామంలో నిరసనలు తప్పలేదు. నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ పథకం ప్రకారం అన్ని మండలాలలో కాంగ్రెస్ కార్యకర్తలు జట్లుగా ఏర్పాటుచేసి రైతులను ముందుగా చైతన్యపరిచారు. ఆమె కూడా అన్ని మండలాలలో తిరిగి అధికారులను పెంచిన కరెంట్ ఛార్జీలపై నిలదీశారు. దీంతో ఈ నియోజకవర్గంలో విద్యుత్ సదస్సులు రసాభాస అయ్యాయి. ఒక ప్రక్క ఎమ్మెల్యే మరోపక్క ఆమె అనుచరులు నిరసనలు తెలపటంతో అధికార బృందాలు ఇరకాటంలో పడ్డాయి. వెంకటగిరి మండలం చెలికంపాడు గ్రామంలో అధికారులను రాజ్యలక్ష్మమ్మ ప్రశ్నలతో ముంచెత్తారు. వీటికి జవాబు ఇవ్వలేక అధికారులు మిన్నకుండి పోయారు. పాలకొండ సత్రం, పారవోలు, సి.సి. కండ్రిగ, పలు గ్రామాలలో అసలు గ్రామసభలు జరగనేలేదు. డక్కిలి మండలం దగ్గవోలులో రాజ్యలక్ష్మమ్మ ముందుగానే వచ్చి మకాం వేయడంతో 9 గంటలకు మొదలు పెట్టాల్సిన గ్రామ సభను అధికార్లు 12 గంటల వరకు కూడా మొదలు పెట్టలేదు. ఈసందర్భంగా ఎమ్మెల్యే మాట్లాడుతూ ప్రజలు మోయలేని విధంగా కరెంటు ఛార్జీలు పెంచి కాకి లెక్కలతో ప్రజలను సంతృప్తి పరచాలని చంద్రబాబు ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నంలో అర్థం లేదని విమర్శించారు.

## రౌడీలా??

5వ పేజీ కొరవ

రౌడీల్లా పగులగొట్టడం ఎంత నీచమైనపని? తగదునమ్మా అని ముఖ్యమంత్రిని నోటికొచ్చినట్లు తిట్టడం తగదని హితవు చెప్పారు. తాను ప్రజాప్రభంజనం వెల్లువెత్తిన సారా వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నా శాంతిభద్రతల సమస్య ఏనాడు సృష్టించలేదని చెప్పారు. ప్రజలు తమ కనెక్షన్లు క్రమబద్ధీకరించుకోకపోతే రేపు ట్రాన్స్‌కో అధికారులు కేసులుపెడితే ఈ నాయకులు వచ్చి విడిపిస్తారా? కావలిలో మాజీ కాంగ్రెస్ ఎమ్మెల్యే అధికారులను రాళ్లతో కొట్టమని సలహా యివ్వడమేమిటని చంద్రమోహన్‌రెడ్డి ప్రశ్నించారు. కాంగ్రెస్ నాయకులు విద్యుత్ గ్రామసభలు జరగకుండా చేసినా వాళ్లు వెళ్లిపోయిన తర్వాత కసుమూరు, ఈదగాలి, ఉప్పుటూర్లలో వందల మంది కనెక్షన్ల కోసం దరఖాస్తు చేసినట్లు వివరించారు. రాష్ట్రంలో కరెంట్ ఛార్జీలను ఏ దశలో రాష్ట్ర ప్రభుత్వం పెంచింది ప్రజలు అర్థం చేసుకొన్నారు. చంద్రబాబు ఏ నిర్ణయం తీసుకొన్నా ముందు ప్రజలకు చెప్పే చేస్తారు. ఛార్జీలు తగ్గించమని ప్రజలు ఆందోళన చేయడం లేదు. చేస్తున్నదంతా పనిలేని కాంగ్రెస్, సిపిఎం నాయకులేనన్నారు. ఛార్జీల పెంపకం మీద ప్రజలను ఒప్పించగలమనే ధైర్యం వుండబట్టే గ్రామసభలు నిర్వహించమని విద్యుత్ శాఖ అధికారులను జనం వద్దకు పంపించినట్లు చెప్పారు. విద్యుత్ ఛార్జీల పెంపకం విషయంలో పార్టీలో భిన్న స్వరాలు లేవన్నారు. ఈ విషయంలో పార్టీలో అందరిదీ ఒకే మాటని సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి స్పష్టం చేశారు.

## తిట్ల షాక్!

5వ పేజీ కొరవ

ఖాళీ అయిన స్థానంలో తిరిగి ఎవరినీ నియమించక పోవడం వల్ల పాఠశాల తలుపులు తెరిచేవారు లేకుండా పోయారు. 19తేదీ జరిగిన విద్యుత్ గ్రామసభలోనూ ఈ విషయాన్ని గ్రామస్తులు ఎమ్డీఓ ప్రమీలారాణి దృష్టికి తెచ్చారు. ఆమె సైతం ఖచ్చితంగా ఉపాధ్యాయులను నియమిస్తానన్న హామీ ఇవ్వలేక పోయారని గ్రామస్తులు ఆవేదన వ్యక్తం చేశారు. మరి ఈ గ్రామంలో పాఠశాలను ఎందుకు ఏర్పాటు చేసినట్లు?

# కొజ్జా పాత్రలో ఎన్నెన్ని కష్టాలో!

మహారాణి చిత్రంలో కొజ్జాపాత్రను పోషించేందుకు ముందు తాను చాలా కష్టపడినట్లు ప్రకాష్‌రాజ్ చెప్పారు. ఈ పాత్ర పోషించాలని అనుకొన్నాక చాలా మంది కొజ్జాలతో మాట్లాడాను. చెవి కుట్టించుకొని ఆ నొప్పికి తల్లడిల్లాను. గోరింటాకు పెట్టించుకోవడం కోసం ఒక బ్యూటీపార్లర్‌కు వెళితే అక్కడి మహిళలు వింతగా చూశారు. నా సైజు గాజులు దొరికక ప్రత్యేకంగా చేయించాను. నేనీ పాత్ర గూర్చి చెప్పగానే మా ఆవిడ అదోరకమైన లుక్ ఇచ్చింది. లిప్‌స్టిక్కూ, నెయిల్ పాలిష్‌లూ ఎందుకమ్మా అని నాకూతురికి చెప్పి నేను లిప్‌స్టిక్, గాజులు నెయిల్ పాలిష్‌తో కనపడేసరికి పెంపేం అంటూ వెక్కిరించిందని ఈ పాత్ర పోషించడం వెనుక కష్టాలు చెప్పుకొచ్చారు.

## లెక్కల్లో తిరుగులేని సంఘవి

పెళ్లి సంబంధం చిత్రం షూటింగ్‌లో ప్రొడక్షన్ ఎకౌంట్‌కు సంబంధించిన లెక్కలు చూసుకొంటూ ఏదో తేడా వచ్చి బుర్ర గోక్కున్న

## ప్రకాష్‌రాజ్ అనుభవం

ప్రొడక్షన్ మేనేజర్‌కు హీరోయిన్ సంఘవి ఏర్చి ఆ లెక్కను ఇట్టే సరి చేసి ఇచ్చింది. అది చూసి అంత ఖచ్చితంగా ఎలా చెయగలిగారని అడిగితే, తనకు మొదట్నుంచి లెక్కలంటే మక్కువ ఎక్కువంది. తాను స్కూల్‌లో చదువుకొనే సమయంలో లెక్కల్లో వందకు వంద మార్కులొచ్చాయంది. నేను ఇంజనీర్ అవుతానని టీచర్లు చెప్పేవారు. నాకేమో డాక్టర్ కావాలని కోరిక. అటు ఇంజనీర్, ఇటు డాక్టర్ కాలేక చివరకు యాక్టరనయ్యానంది. తాను చదువుకొన్న స్కూల్ ప్రిన్సిపల్ ఎవరికి లెక్కలు చెప్పినా నాకే లెక్కల్లో ఎటువంటి సందేహమే వుండదంది.

## అతిధినటునిగా నాగార్జున

తన కెరీర్ ఫ్లాపుల వైపు పయనిస్తున్నప్పుడు 'నువ్వువస్తావని' వంటి హిట్ చిత్రం ఇచ్చిన సూపర్‌గుడ్ సంస్థ తరువరి చిత్రంలో నాగార్జున అతిధిపాత్రను పోషిస్తున్నారు. వింజే దర్శకత్వం వహించే ఈ చిత్రంలో శ్రీకాంత్ హీరో.

# మోహన్‌బాబు చిత్రానికి రజనీ కథ

మోహన్‌బాబు నటిస్తున్న 500వ చిత్రం 'రాయలసీమ రామన్న చౌదరి'కి తమిళ సూపర్ స్టార్ రజనీకాంత్ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చడమేగాక మ్యూజిక్ సిట్టింగ్స్‌లో కూడా కూర్చున్నారు. ఈ సినిమాకు పేరు పెట్టింది రజనీకాంతేనని, దర్శకునిగా సురేష్‌కృష్ణను పెట్టుకోమని సలహా ఇచ్చింది కూడా ఆయనేనని మోహన్‌బాబు చెప్పారు. దీనికి తోడు తాను సినిమాలో అప్పుడప్పుడు పలికేందుకు కొన్ని సంభాషణల మేలి బంం వ్రాసిచ్చారని వివరించారు. 'ఒకప్పుడు ముగ్గురు దేవుళ్లు ఎంతో మంది మహానుభావులు ఉండేవారు. ఇప్పుడు మూడు కోట్ల మంది దేవుళ్లు, ఎక్కువ మహానుభావులు కూడా లేరు' గుర్రానికి కాళ్లలో బలం, సింహానికి గోటిలో బలం, గరుడపక్షి ముక్కులో బలం, ఈ రాయలసీమ రామన్న చౌదరికి వళ్లంతా బలమేరా' అనే డైలాగ్స్‌ను ఈ సినిమాలో మోహన్‌బాబు కొన్ని సన్నివేశాల్లో పలుకుతారట.

## హిందీ చిత్రాల్లో కీర్తిరెడ్డి

తొలిప్రేమ చిత్రంలో నటించిన కీర్తిరెడ్డి హీరోయిన్‌గా తెలుగు చిత్రాల్లో బిజీ అవుతుందని పలువురు ఊహించారు. కాని కాల్షీట్స్ విషయంలో నిర్మాతలను ఇబ్బందులకు గురిచేస్తుందన్న విమర్శలు రావడంతో ఆమె చేతిలో చిత్రాలే లేకుండా పోయాయి. తొలిప్రేమ చిత్రాన్ని ప్రముఖ హిందీ చిత్ర నిర్మాత వశుభగ్నానీ చూడటంతో అదృష్టం కలిసి వచ్చింది. అభిషేక్ బచ్చన్‌తో తాను నిర్మిస్తున్న 'తేరా జాదూ చల్‌గయా'లో హీరోయిన్‌గా కీర్తిరెడ్డిని బుక్ చేశారాయన. ఈ సినిమాలోని కొన్ని సన్నివేశాల్లో కీర్తి నటనను చూసి, దర్శకుడు రాజీవ్ రామ్ తన 'ప్యార్ ఇష్క్ ఔర్ మొహబ్బత్' చిత్రంలో ఆమెను హీరోయిన్‌గా

## హైదరాబాదు సినిమా వార్తలు

ఎంపిక చేశారు. మరో రెండు హిందీ చిత్రాల్లో కూడా నటిస్తున్నట్లు కీర్తిరెడ్డి చెప్పింది.

## తెరపై మళ్లీ రతి అగ్నిహోత్రి

తెలుగుతోపాటు పలు హిందీ చిత్రాల్లో నటించిన రతి అగ్నిహోత్రి ఆమె తండ్రి మరణానంతరం తన కెరీర్‌కు ఫుల్‌స్టాప్ పెట్టింది. తనకు నైతిక మద్దతు నిచ్చిన అనిల్ అనే వ్యక్తిని వివాహం చేసుకొని గృహిణిగా స్థిరపడింది. 15ఏళ్ల ఆమె కుటుంబ జీవితంలో ఎటువంటి వివాదాలు చోటు చేసుకోలేదు. ఖాళీగా వున్న సమయాన్ని సద్వినియోగం చేసుకోవడంలో భాగంగా రతి 'రేకి'లో మాస్టర్స్ చేసింది. నేచురోపతి కోర్సు చదవడంతో పాటు సురోగ్ అనే కొరియా వైద్య విధానాన్ని అధ్యయనం చేసింది. కుట్టుపని నేర్చుకొని శిల్పకళలో ప్రావీణ్యం సంపాదించింది. ఇటీవల దర్శకుడు రాహుల్ రావల్ ఆమె ఇంటికి ఫోన్ చేసి కాజోల్‌కి అమ్మగా నటిస్తారా అంటే వెంటనే ఒప్పుకొంది. దీని గూర్చి చెప్తూ ప్రస్తుతం నేను ఒక టీనేజ్ తల్లిని. అలాంటప్పుడు సినిమాలో తల్లిగా నటించడానికి అభ్యంతరం? ఈ విషయంలో తనకు ఎలాంటి నగోలు లేవంటుంది.

## శాస్త్రి పాటను బాగోలేదన్న పవన్

తాను ఎంతో కష్టపడి వ్రాసిన పాటను హీరో పవన్ కళ్యాణ్ బాగోలేదని చెబితే మొదట ఆశ్చర్యపోయాను. తర్వాత తన తప్పుని తాను తెలుసుకొన్నట్లు సిరివెన్నెల సీతారామశాస్త్రి చెప్పారు. మహారాణి చిత్రం పాటల క్యాసెట్లను హైదరాబాద్‌లోని ఫిల్మ్ ఛాంబర్ ప్రివ్యూ థియేటర్‌లో ఆవిష్కరించిన సభలో సీతారామశాస్త్రి, ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా

తొరవ 11వ పేజీలో

చూసొద్దాం.. రండి చిత్రంలో రంభ

# హీరోనుబట్టే మీనా మూడ్స్

సినిమాల్లో తన సరసన నటించే హీరోలను బట్టి ఆయా సన్నివేశాల్లో ప్రవర్తిస్తుంటానని హీరోయిన్ మీనా చెప్పింది రజనీకాంత్.

## ఇదో కాకమ్మ కథ

చిరంజీవి వంటి నటులతో నటిస్తున్నప్పుడు నాకు చాలా అనుభవం, పరిణతి చెందిన దానిలా ఫీలౌతుంటాను. చాలా మెచ్యూర్డ్‌గా ప్రవర్తిస్తుంటాను. అదే ప్రభుదేవా వంటి వారితో నటిస్తున్నప్పుడు సెట్‌లో హడావుడి చేస్తూ, అందర్నీ ఆటపట్టిస్తుంటాను. బాల నటులతో నటించాల్సి వచ్చినప్పుడు నా గొంతు పెద్దదౌతుంది. గట్టిగా మాట్లాడడం, నవ్వడం, తుళ్లడం; అన్నీ చేస్తాను. ఏంతైనా నేను చిన్నపిల్లనే కదండీ అంటుంది మీనా మరి ఆమె మాటలు నమ్ముదామా!

# ఎయిడ్స్‌రోగి పాత్రలో నందితా!

సంచలన చిత్ర కథనాయిక నందితా దాస్ ఏక్ అలగ్ మౌసమ్ చిత్రంలో ఎయిడ్స్ వ్యాధి సోకిన రోగి పాత్రను పోషిస్తుంది. నందితా గతంలో ఫైర్, ఎర్త్ చిత్రాల్లో మేకప్ లేకుండా వాటర్ చిత్రంలో గుండుతో నటించింది.

## సినీ సంచలనం

ఎందుకిటువంటి పాత్రలను పోషిస్తున్నారంటే, వైవిధ్యం వున్నప్పుడే పాత్రలకు గుర్తింపు వస్తుంది. అప్పుడే నటిగా తనను తాను నిరూపించుకోవడానికి అవకాశం చిక్కుతుందని చెప్పింది. వాటర్ చిత్రం కోసం గుండు చేయించుకున్నాను. ఏక్ అలగ్ మౌసమ్ చిత్రంలో పాత్ర పరంగా పెద్దజుట్టు అవసరం. అందువల్ల పొడువాటి జుట్టు వున్న విగ్గు ధరిస్తున్నట్లు చెప్పింది.

## నేను అజాత శత్రువుని

తనకు మొదటి నుంచి కూడా ఎవరినీ శత్రువులుగా చేసుకోవడమంటే ఇష్టముండదని, దర్శకుడు ఎస్వీకృష్ణారెడ్డి చెప్పారు. నాకీ ప్రపంచంలో ఎవరూ శత్రువులు అనే వాళ్లు ఉండకూడదని నా అభిప్రాయం. ఎవరైనా నాకు వ్యతిరేకంగా వున్నారని కాని, శత్రువులు కాని వున్నారనిపిస్తే వాళ్ల మీద నాకు కోపం కలిగినా దాన్ని పెంచుకోను. వారిని మిత్రులుగానే భావిస్తాను. వారు కూడా నా బాటలో వచ్చేలా ప్రయత్నం చేస్తాను. అలరికి తప్పకుండా వారిని నా మిత్రులుగా చేసుకొంటాను. నాకి ఎప్పుడూ, ఎవరితోనూ ఘర్షణపడే మనస్తత్వం కాదన్నారాయన

# బాగానే ఉన్న 'బాగున్నారా!'

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

"బాగున్నారా" చిత్రానికి, దర్శకుడు బక్రుద్దీన్ కథ వ్రాశారు. ఇది కుండ మార్పిడి వివాహాన్ని ఆధారం చేసుకున్న కథ. ఒక ఇంట్లో వున్న అబ్బాయికి మరో ఇంట్లో వున్న అమ్మాయితో పెళ్లి జరిపి, మరో ఇంట్లో వున్న అబ్బాయి పెళ్లి, ఆ ఇంట్లో వున్న మరో అమ్మాయితో, అంటే అమ్మాయిలు, అబ్బాయిలు మార్పిడితో జరిగే పెళ్లిళ్లను కుండ మార్పిడి పెళ్లిళ్లు అంటారు. ఈ కుండ మార్పిడి పెళ్లిళ్లు కలిసి రావని, అవి చాలా అనర్థాలకు దారి తీస్తాయని, ఈ సాంప్రదాయాన్ని చాలా మంది పాటించరు. ఇది కేవలం మూఢ నమ్మకమని ఈ చిత్ర కథకుడు దర్శకుడు అయిన బక్రుద్దీన్ రుజువు చేశారు.

హరిశ్చంద్రరావు (విజయ కుమార్) చెల్లెలు యమునను (యమున) శ్రీహరికిచ్చి పెళ్లిచేస్తారు. శ్రీహరి (శ్రీహరి)చెల్లెలిని (కల్పన) హరిశ్చంద్రరావు కిచ్చి పెళ్లి చేస్తారు. ఇవి కుండ మార్పిడి వివాహాలన్నమాట. కొంత కాలానికి శ్రీహరి, హరిశ్చంద్రరావుల మధ్య కలహాలు రేగుతాయి. అవి తీవ్ర రూపం దాలుస్తాయి. వాటిని సహించలేని శ్రీహరి భార్య యమున, హరిశ్చంద్రరావు భార్య కల్పన ఆత్మహత్య చేసుకొని చనిపోతారు. తన భార్య, తన చెల్లెలు ఇద్దరూ ఒకేసారి చనిపోవటం హరిశ్చంద్ర రావు గుండెను గాయపరుస్తుంది. దీనికి కారణం కుండ మార్పిడి పెళ్ళేనని అతను నిర్ధారిస్తాడు ఈ కథ ఫ్లాష్ బ్యాక్‌గా వస్తుంది. అసలు కథ, హరిశ్చంద్రరావు కుమారుడు (సురేష్) వివాహం సత్యనారాయణ (గిరిబాబు) కుమార్తె సంగీత (దుర్గ)తో జరిపేందుకు, నిశ్చితార్థం సంబరాలతో ప్రారంభమవుతుంది. ఆ నిశ్చితార్థపు కార్యక్రమానికి వచ్చిన సురేష్ చెల్లెలు ప్రియ (ప్రియాగిల్), సంగీత అన్నయ్య ప్రదీప్ (నవీన్) తొలి చూపుల్లోనే ప్రేమించుకుంటారు. పెళ్లి చేసుకొనేందుకు నిశ్చయించు కొంటారు. ఇక్కడ మరలా కుండ మార్పిడి సాంప్రదాయపు పెళ్లి తలెత్తుతుంది. ఇది తెలుసుకున్న హరిశ్చంద్రరావుకు, కుండ మార్పిడి పెళ్లి వల్ల తన భార్య, తన చెల్లెలు ఆత్మహత్య చేసుకొని చనిపోవటం ఫ్లాష్‌బ్యాక్‌లో గుర్తొస్తుంది. కుండ మార్పిడి పెళ్లిళ్లు చాలా అనర్థాలకు దారితీస్తాయి కాబట్టి ఈ సాంప్రదాయపు పెళ్లి తన పిల్లలకు జరగకూడదన్న నిర్ణయానికొస్తాడు. ప్రియ పెళ్లి ప్రదీప్‌తో జరగదని ఖచ్చితంగా చెప్పేస్తాడు. ప్రియ, ప్రదీప్‌లు నిరుత్సాహ పోతారు.

ప్రియ, ప్రదీప్‌ల ప్రేమ జంటను మూఢ నమ్మకాలతో పెద్దలు వేరు చేస్తున్నారని శ్రీహరి తెలుసుకుంటాడు. ఆ ప్రేమ జంట పెళ్లి జరిపించేందుకు అతను పట్టుదలతో. పెళ్లికి అడ్డు తగులుతున్న హరిశ్చంద్రరావుతో వాదనకు దిగుతాడు. ఈ వాదనలో కలత చెందిన హరిశ్చంద్రరావు ప్రమాదానికి గురవుతాడు. రావు బ్రతుకులతో ఆస్పత్రి పాలవుతాడు. తన తండ్రి పతనానికి కారణం కుండమార్పిడి పెళ్ళేనని సురేష్ ప్రదీప్‌ను నిందిస్తాడు. తన మూలంగా సురేష్ తండ్రి చావుకు గురికాకూడదని, ఆ ఊరి నుంచి వెళ్ళి పోవాలను కుంటాడు ప్రదీప్. ఆ సమయాన శ్రీహరి జోక్యం చేసుకొని, హరిశ్చంద్ర రావు భార్య, చెల్లెలు చనిపోయేందుకు కారణం కుండమార్పిడి పెళ్లికాదని, తన కాడిన్ను మెంటాలిటీ, తన క్రూరత్వం వల్లనేనని శ్రీహరి కుండ బద్దలు కొట్టి చెప్పి అందరినీ నమ్మిస్తాడు. దాంతో హరిశ్చంద్రరావు కోలుకుంటాడు. "బాగున్నారా"

తొరవ 11వ పేజీలో

# వారఫలాలు

24-6-2000తేది నుండి 30-6-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రవి, కుజ, శుక్ర, బుధులు; కర్కాటకంలో రాహువు; మకరంలో కేతువు; మీన, మేష, వృషభాలలో చంద్రుడు.

### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

శ్రమ, శరీర బాధ ఎక్కువగా ఉంటుంది. అనారోగ్య బాధలున్నా నెమ్మదిగా సర్దుకుంటుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి ఆదాయం పెరిగి, ఆర్థికస్థితి బాగుంటుంది. ఆర్థిక లావాదేవీలు అనుకూలిస్తాయి. సమస్యా పరిష్కారాలకు ప్రయత్నావకాశాలు వస్తాయి. సోదరులతో కొద్ది విభేదాలుంటాయి. ఉద్యోగులు పనిభారంతో శ్రమపడతారు. అధికారుల అనుకూలతతో పనులు జరుగుతాయి.

### వృషభం
(కృత్తిక, 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

అనుకున్న పనులు నిదానంగా జరిగి పూర్తికాగలవు. అప్పుడప్పుడు పనులయందు అందోళన ఉంటుంది. నరాలు, చర్మ సంబంధిత రుగ్మతలుంటాయి. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. కాని అనవసర ఖర్చులు కూడా ఉంటాయి. అధికారుల సహకారంతో ఉద్యోగులు బాధ్యతలను చక్కగా నిర్వర్తిస్తారు. విద్యార్థులు విద్యలో ప్రగతి చూపించగలరు.

### మిధునం
(మృగశిర, 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

మంచి పలుకుబడి, కీర్తి కలిగి అనుకున్న పనులు సాధిస్తారు. రావలసిన బాకీలు, రుణాలు లభిస్తాయి. అనారోగ్య సమస్యలు తీరిపోతాయి. వృత్తి, వ్యాపార వృద్ధికి అవకాశాలు వస్తాయి. వారం చివర ఇతరులతో కొద్ది వివాదాలు. ఉద్యోగుల బాధ్యతల నిర్వహణలో గుర్తింపు. అధికారుల సహకారం పొందుతారు. స్థానచలనం, ఉద్యోగావకాశాలు రావచ్చును.

### కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేష)

వారం ప్రారంభంలో అనుకోని ప్రయాణాలు, పనులకు ఆటంకాలు వస్తాయి. మానసిక అశాంతి, ఆరోగ్యలోపం ఉంటుంది. నిర్ణయాలు తీసుకొనలేని స్థితి ఉంటుంది. కుటుంబ కలతలుంటాయి. సన్నిహితులు సహాయపడ కుండా తప్పుకొంటారు. డబ్బు, వస్తువులు నష్టం కాగలవు. ఆదాయం తగ్గిపోతుంది. ఆర్థికపరమైన సమస్యలెదురు కాగలవు. శుభకార్య నిర్ణయాలకు అవకాశం వున్నది.

### సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

కొత్త వస్తువులు, వాహనాలు కొంటారు. ఆర్థిక సమస్యలు తీరగలవు. ఆర్థికపరిస్థితి బాగుపడి ఆదాయం పెరుగుతుంది. దూరదేశ ప్రయాణాల అవకాశాలు వస్తాయి. పెట్టుబడులపై లాభాలు, బిడ్డల విద్యా, ఆరోగ్య సమస్యలుంటాయి. శుభకార్య ప్రయత్నాలు అనుకూలించగలవు. అధికారుల సహకారంతో ఉద్యోగులు విధి నిర్వహణలో గుర్తింపు పొందుతారు.

### కన్య
(ఉత్తర 2,3,4పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. ఆర్థికాభివృద్ధికి వ్యాపారస్తులకు మంచి అవకాశాలు వస్తాయి. దూరపు బంధువులు రావడం, కొత్త బాధ్యతలు నిర్వహించడం, ఉద్యోగ నిర్వహణలో సమర్థత చూపి గౌరవం పొందడం, ఆస్తి సమస్యల పరిష్కారం జరుగవచ్చును. పలుకుబడితో పనులు సాధించుకొంటారు. దూరప్రయాణాలు, సాహిత్య, రాజకీయ కార్యాలలో పాల్గొనడం జరుగుతుంది.

## పంచాంగం

శుక్రమౌఢ్యమి జరుగుచున్నది.

జూన్ తిథులు

జ్యేష్ఠ బహుళ

తేది 24 శని సప్తమి ప 1.15 గం.వ

తేది 25 ఆది అష్టమి ప 1.10 గం.వ

తేది 26 సోమ నవమి ప 12.40 గం.వ

తేది 27 మంగళ దశమి ప 11.37గం.వ

తేది 28 బుధ ఏకాదశి ప 10.10 గం.వ

తేది 29 బేస్త ద్వాదశి ఉ 8.25 గం.వ

తేది 30 శుక్ర త్రయోదశి ఉ 6.30 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

### తుల
(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

సొంత పనులు అనుకూలంగా జరిగిపోతాయి. ఆర్థికంగా పరిస్థితి బాగుంటుంది. ఆదాయం తృప్తికరంగా ఉంటుంది. కాని వారాంతంలో డబ్బుకు వత్తిడి పెరుగుతుంది. ఖర్చులు అదనంగా పైనబడగలవు. కుటుంబ సభ్యుల అనారోగ్యబాధలుంటాయి. ఉద్యోగులకు అదనపు బాధ్యతలు తప్పవు. ఆస్తి వ్యవహారాలు, రావలసిన బాకీలు పెండింగ్‌లో పడతాయి. రాజకీయ, సాహిత్య కళా రంగాల వారికి ప్రోత్సాహం బాగుంటుంది.

### వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థికస్థితి కొంత బాధాకరంగా ఉంటుంది. మోసగించబడటం, డబ్బు నష్టపోవడం జరుగుతుంది. రావలసిన బాకీలువాయిదా పడతాయి. బంధుమిత్రులతో విభేదాలు, అపనిందలు పైనబడటం జరుగుతుంది. రాజకీయ సమస్యలు, కుటుంబ సభ్యుల అనారోగ్య బాధలుంటాయి. అనుకున్న పనులు నిదానంగా జరుగగలవు. స్వల్ప అనారోగ్య బాధ పొందుతారు. ఉద్యోగులు జాగ్రత్తగా విధి నిర్వహణ చేయాలి.

### ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ఉద్యోగుల పని బాధ్యతలు పెరుగుతాయి. స్థానమార్పు, ఉద్యోగావకాశాలు లభించడం జరుగుతుంది. అనుకోని ఖర్చులు పెట్టడం వల్ల ఆదాయం సమతుల్యం అవుతుంది. కుటుంబ సభ్యులతో విభేదాలు, భూమితో సంబంధం కల్గిన ఆదాయం లభించక పోవడం ఉంటుంది. శిరస్సు సంబంధిత రుగ్మతలుంటాయి. నూతన వస్తువులు కొనడం, కొత్త వ్యక్తులతో పరిచయాలుంటాయి.

### మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

అన్ని రంగాల వారికి ఆర్థికంగా ఇబ్బందులుంటాయి. కాని అవసరాలు గడుపుకొంటారు. భూమి, గృహ సంబంధ క్రయవిక్రయాలు జరిగే అవకాశం ఉన్నది. కుటుంబ స్త్రీల ఆరోగ్యం సరిగా ఉండకపోవచ్చును. తొందరపాటు వల్ల తగాదాలు రాకుండా జాగ్రత్తపడాలి. ప్రభుత్వం వైపు సమస్యలు కలుగవచ్చును. ఉద్యోగులు పనిభారంతో శ్రమపడతారు. వారాంతంలో మీకు అనారోగ్యం కలుగవచ్చును. మిత్రుల సహకారం స్వల్పంగా లభిస్తుంది. వారం మొదట ముఖ్యమైన పనులు వాయిదా వేసు కొనడం మంచిది.

### కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ధైర్యంగా ఇతరుల సహకారంతో పనులు జరిగిపోతాయి. ఆలోచనలు అనుకూలిస్తాయి. ఆర్థికంగా బాగుండి ఆదాయం పెరుగుతుంది. శత్రువులు, మిత్రులుగా మారుతారు. కుటుంబ సభ్యుల ఆరోగ్యం బాగుపడుతుంది. అధికారుల సహకారం బాగుంటుంది. గృహ, వాహన రిపేర్లుంటాయి. వ్యవసాయ, వృత్తి, వ్యాపారాల నిర్వహణలో ప్రగతి కనిపిస్తుంది.

### మీనం
(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆదాయం బాగుంటుంది. పనులు ఆలస్యంగా జరుగుతాయి. చెవి, కన్ను, చర్మ సంబంధిత రుగ్మతలు కలుగవచ్చును. కొద్దిపాటి కుటుంబ విభేదాలు కలుగుతాయి. వ్యవహారాలు పరిష్కారానికి వస్తాయి. బంధువుల రాకపోకలు, కొత్త పరిచయాలు, నూతన వస్తువులు కొనడం జరుగుతుంది. ఉద్యోగులకు, అధికారుల సహకారం కన్నా పనిభారంతో బాధపడగలరు. వృత్తి, వ్యవసాయ, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. పెట్టుబడులపై ఆదాయం బాగుంటుంది.

## జనవాణి

మూడవ పేజీ కొరవ

దర్యాప్తు సంస్థలే ఆ విషయాన్ని నిగ్గు తేలుస్తాయి.

నెల్లూరు బయ్యావాను

### పిల్లలపార్కును జాగ్రత్తగా కాపాడుకోవాలి

నెల్లూరు ప్రజల చిరకాల కోరికయైన చిన్న పిల్లల పార్కు అనుకొన్న దానికంటే అద్భుతంగా తయారవ్వడం ఆనందకరం. పార్కును కట్టాలన్న ఆలోచన రమేష్‌రెడ్డిది అయితే, మునిసిపల్ స్థలం, నిధులు కేటాయించిన ఘనత ఆనం వివేకానందరెడ్డిది. పార్కుకో సుందర రూపం తెచ్చిన రూపశిల్పులు జిల్లాకలెక్టర్ శ్రీలక్ష్మి, దాత జె.ఎస్. రెడ్డిలు. ఇప్పటి మునిసిపల్ పాలకవర్గం కూడా పెద్ద మనసుతో పార్కును టూరిజం శాఖకు అప్పగించడం ఆనందకరం. టౌన్‌లోని మిగతా పార్కుల్లా ఈ పార్కును తయారు చేయకుండా సక్రమంగా నిర్వహించేందుకు జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి ఒక కార్యాచరణ ప్రణాళికకు రూపకల్పన చేయాలి.

నెల్లూరు వాస్తు రామచంద్ర

### నవాబుపేటలో కోతులబెడద

నెల్లూరు నవాబుపేటలో వానర మూక ఆగడాలు ఈ మధ్య ఎక్కువైనాయి. పూల మొక్కలను ధ్వంసం చేయడం, కేబుల్ టివి వైర్లను త్రెంచడం, కొళాయిలను త్రిప్పి నీరు వృధా చేయడం చేస్తున్నాయి. వీటికి తోడుగా బయట అమర్చిన ఎలక్ట్రిక్ బల్బులను పగులగొట్టడం, ఇళ్లలోని సామాన్లు ఎత్తుక పోవడంతోపాటు రాత్రుళ్లు మిద్దెల మీద శయనించి ప్రజలను ఇబ్బంది పెడుతున్నాయి. మునిసిపల్ అధికార్లు తక్షణం స్పందించి నవాబుపేట ప్రజలకు ఈ వానర సైన్యం నుంచి ఉపశమనం కల్గిస్తారని ఆశిస్తున్నారు.

నవాబుపేట డాక్టర్ ఎ. జగదీష్

### పోలీసు దౌష్ట్యానికి నిదర్శనం

విద్యుత్ ఛార్జీలు పెంపుదలను నిరసిస్తూ ఒంగోలు వచ్చిన రాష్ట్ర గనుల మంత్రి పోచారం శ్రీనివాసులురెడ్డిని నిలదీశారన్న నెపంతో పోలీసులు వామపక్ష నాయకులను గొలుసులతో కట్టి పోలీస్ స్టేషన్ దాకా ఈడ్చుకపోయారు. ఇంతకన్నా పాశవిక చర్య మరొకటి లేదు. ఈ రాష్ట్రంలో మానవహక్కులు అనేవి ఏ స్థాయికి చేరాయో పోలీసులు ఎంతటి విశృంఖల అధికారాలు అనుభవిస్తున్నారో ఈ సంఘటన రుజువు చేస్తున్నది. ఈ విషయాన్ని జాతీయ మానవహక్కుల కమీషన్ దృష్టికి తీసుకవెళ్లేందుకు ప్రజాస్వామ్యవాదులు, పౌర హక్కుల సంఘాలు ప్రయత్నించాలి. నేరం రుజువయ్యే వరకు నిందితుడు నేరస్తుడు కాడని, ఏ వ్యక్తి చేతులకూ బేడీలువేసి క్రూరంగా వ్యవహరించరాదని వ్యక్తి గౌరవానికి భంగం కలుగనివ్వరాదనీ పలు కోర్టు తీర్పులున్నాయి. కాని రాష్ట్రంలో పోలీసులు నియంతృత్వ పోకడలకు పోవడం, ప్రభుత్వం ఈ విషయమై స్పందించక పోవడం దారుణం.

నెల్లూరు కె.రామయ్య

### మంచినీటి సమస్యను పట్టించుకోండి

ఈ యేడాది మంచినీటి కొరత జిల్లాలో తీవ్రతరం దాల్చే సూచనలున్నాయి. గత ఏడాది వర్షాలు లేకపోవడం, ఈ యేడాది వర్షాలు ఇంకా పడకపోవడం వల్ల బావుల్లో నీటి మట్టం తగ్గిపోతుంది. మునిసిపల్ కొళాయిల్లో వచ్చే నీటి ఆధారంగానే ప్రజలు తమ నిత్యకృత్యాలు కానిస్తున్నారు. కరవు పనుల్లో భాగంగా యుద్ధ ప్రాతిపదికన చెడిపోయిన బోర్లు రిపేర్లతోపాటు కొత్త వాటిని వేయిస్తామన్నారు. నీటి ఎద్దడి తీవ్రంగా వున్న చోట మునిసిపాలిటి ట్యాంకర్ల ద్వారా నీరు సరఫరా చేస్తుందని అధికారులు ఘనంగా ప్రకటించారు. కాని ఇంత వరకు ఎటువంటి చర్యలు తీసుకోలేదు. ఈ విషయమై అధికారులు స్పందించ వలసి వుంది.

నెల్లూరు టి.వి.నారాయణ

### విద్యలో అణగారిన వర్గాలకు అన్యాయం

ప్రభుత్వ అధీనంలోని ఎన్నో పాఠశాలలు, జూనియర్ కాలేజీలు, డిగ్రీ కాలేజీలలో కనీస వసతులు లేవు. చాలా చోట్ల వివిధ సబ్జెక్టులు బోధించే సిబ్బంది లేరు. అయినా సిలబస్ పూర్తయినట్లు విద్యా సంవత్సరాన్ని నెట్టేస్తున్నారు. ప్రభుత్వం ఒక వైపు ఫీజులు వసూలు చేస్తూ మరో పక్క కనీస సౌకర్యాలు కల్పించక పోవడం దారుణం. రాష్ట్రంలో ప్రతి రంగాన్ని ప్రైవేటుపరం చేస్తున్న పాలకులు తాము ప్రజలకు ఆరోగ్యం, విద్య వంటి సామాజిక బాధ్యతలు నెరవేర్చడం కోసమే వివిధ ప్రభుత్వ రంగ సంస్థల్ని వదిలించుకొంటున్నామని చెబుతూ, మరో ప్రక్క విద్యా రంగానికి సైతం గుండుసున్నా చుడుతున్నారు. గత ఏడాది యాభైకిపైగా పాఠశాలల్లో 10వ తరగతి పరీక్షల్లో జీరో స్థాయి ఫలితాలు సాధించాయి. ప్రభుత్వ పాఠశాలల్లో సరైన విద్య దొరకక తల్లిదండ్రులు తమ పిల్లల్ని తలలు తాకట్టుపెట్టి వేల రూపాయలు చెల్లించి ప్రైవేటు పాఠశాలలకు, కాలేజీలకు పంపుతున్నారు. ఈ వ్యవహారంలో అణగారిన వర్గాల పిల్లల తల్లిదండ్రులు ఎటువంటి సాహసం చేసే ధైర్యంలేక అన్యాయమై పోతున్నారు.

నెల్లూరు కె.సుదర్శన్

### యాభైఏళ్ల క్రితం

మూడవ పేజీ కొరవ

సంప్రదింపులు జరుగుతున్నది. కృషి జరుగుతున్నది. ప్రత్యక్ష వ్యతిరేక పక్షీయుడైన రామకృష్ణారెడ్డి ఎన్.రెడ్డి గార్ల మధ్య అబ్బయ్య అనే టంకణం అతుకు తున్నది ఏక పక్షీయులైన ఏసిరెడ్డి వి.కె.రెడ్డి గార్లు చీలిపోతున్నారు. విడిబడి పోతున్నారు. దూరస్థులౌతున్నారు. దుమ్మెత్తి పోసుకొంటున్నారు. అన్ని పక్షాలు ఏకం గావడమంటే సంతోషమేగాని 'అంతర్గాహం - బహిష్కృతం' గా వుండే విభిన్న పక్షాలు మమేక నటన జరపడం విభిన్నం కావడానికి వీలులేని పక్షాలు ఛిద్రరూపం దాల్చడం అభిలషించదగినది గాదు.

#### అవి - ఇవి

తాను ప్రాక్టీసును నిలిపివేసుకొంటున్నానని, తన వద్ద వున్న వస్తువులు కావలసిన డాక్టర్లు 26తేది తన్ను నెల్లూరులో కలసుకొన వచ్చునని డాక్టర్ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి గారు తెలియజేస్తున్నారు.

#### టౌనులో సినిమాలు

వినాయక: మొదటిరాత్రి, దీని తర్వాత బర్సాత్; కొత్తహాలు: పల్లెటూరి పిల్ల, మణిలో 24తేదీ నుంచి ఆహుతి.

#### నెల్లూరు బజారు ధరలు

| | |
|---|---|
| మొలగొలుకులు పుట్టి | 199-2-3 |
| వంకాయలు వీశ | 0-6-0 |
| బెండకాయలు వీశ | 1-0-0 |
| చామగడ్డలు వీశ | 0-7-0 |
| బంగినపల్లి మామిడి పండ్లు (పెద్దవి) 100 | 15-0-0 |
| సవర (బంగారు) | 72-0-0 |

#### మీరు విన్నారా?

కలెక్టర్ మలయప్పన్ మార్పును రద్దు చేయించుటకు మద్రాసుకు రాయబారం నడిపిన హరిజన నాయకులు కొందరు ప్రధానిని చూస్తే నేనేమి చేయలేనంటే ఒక మంత్రిని కలసుకొంటే మలయప్పన్‌కు ఇంక్రిమెంట్లు యిచ్చి, ఇంత కంటే పెద్ద పదవికి పంపుతుంటే అది మీకు ఇష్టం లేదా అని జవాబిస్తే, ప్రభుత్వంలో మరొక బాధ్యత గల వ్యక్తి, 'మలయప్పన్ మారిపోతేయేమి, లేబర్ లీడరు చిన్నయ్య వున్నాడు గదా భూములు పంచడానికి' అని చెప్పారని, ఇంత దూరం పోయి, ఇంత మాట అనిపించుకొన్నందుకేమో తాము పోయింది, అచ్చట జరిగిన వృత్తాంతం బయటకు పొక్క నీయకుండా రాయబార వర్గ సభ్యులు దొంగకు తేలు కుట్టినట్లు గుప్చిప్‌ నున్నారని అనుకొంటుండినారట.

## సణుగుడు

2వ పేజీ కొరవ

కష్టం కల్గిస్తే తమ పనులు చెడతాయన్నది వీరి భయం. ఎమ్మెల్యే, ఎమ్పీ పదవులలో వున్నవారే అధికారులను చూసి ఇల్లా భయపడితే, ఇక సామాన్య ప్రజలు ఏమి మాట్లాడగలుగుతారు. పిల్లల పార్కు ప్రారంభోత్సవ సభ దగ్గర - వేదిక క్రింద నేతలు మాట్లాడింది వేరు. వేదికెక్కిన తర్వాత చేసిన ప్రసంగాలు వేరు. అంతా హిపోక్రసీ.

పిల్లల పార్కు చాలా అందంగా తయారయ్యిందన్నది మాత్రం నిజం. ఆ విషయంలో రెండవ అభిప్రాయం లేదు. నెల్లూరు వంటి చిన్న టౌన్‌కు అది చాలా పెద్ద అలంకారం. నెల్లూరీయులు గర్వంగా చెప్పుకోదగిన పార్కు.

దీనికి వాడింది మునిసిపల్ స్థలం, ఖర్చు మునిసిపల్ డబ్బు; పని చేసింది మునిసిపల్ వుద్యోగులు; ఇప్పుడు ఆ స్థలం ఒక్కటి విలువ కట్టినా ఏడెనిమిది కోట్లు అవుతుంది. మునిసిపాలిటీ అంటే గెల్చిన ఛైర్మన్ల సొత్తు కాదు; అది పౌర సంస్థ. దాని ఆస్తి అంటే పౌరుల సంపద క్రింద లెక్క. ఇంత విలువైన సంపదను వట్టి పుణ్యానికి టూరిజం శాఖకు అప్పచెప్పడం అన్యాయం.

మునిసిపాలిటీ అయితే దీన్ని భరించలేరని, తొందరలోనే పాడు పెడతారని, పార్కు మంచి కోసమే టూరిజం శాఖను ఆశ్రయిస్తున్నామని కలెక్టర్ గారు చెప్తున్నారు. మునిసిపాలిటీ పట్ల ఆమెకు గల అభిప్రాయంలో తప్పు పట్ట వలసింది ఏమీ లేదు. స్వతంత్ర పార్కును సైతం నడపలేక చెత్తకొట్టగా మారుస్తున్న బడుద్ధాయిలు. మన మునిసిపల్ పాలకులు. అటువంటి అసమర్థుల చేతికి ఇంత కష్టపడి నిర్మించిన పార్కు అప్పచెప్పడానికి కలెక్టర్ గారికి మనసు ఒప్పినట్లు లేదు. కాని ఆమెకు తెలియనిదేమిటంటే, టూరిజం శాఖ - అసమర్థ, అవకతవక నిర్వహణలో మునిసిపాలిటీకి తాత వంటిది. హైదరాబాద్ నగరంలో, లక్షలు లాభం వచ్చే యాత్రి నివాస్ వంటి సంస్థలే వారి చేతుల్లో పడి పాడు పడ్డాయి. నాగార్జున సాగర్‌కు వెళ్తే టూరిజం శాఖాధికారులను చెట్టుకు కట్టి కొట్టాలనిపిస్తుంది. నెల్లూరు వరకు చూసినా మైపాడు బీచ్ గెస్ట్ హౌస్‌ను వారు ఎంత సుందర ముదనష్టంగా నడుపుతున్నది మనకు తెలుసు. టూరిజం శాఖలో చాలినంత మంది వుద్యోగులు లేరు, వున్న వారు పనిచేయరు. వారు పని చేయడమంటూ జరిగితే, అది మిగిలి వున్న నిధులు భోంచేయడానికి మాత్రమేననడం ఆరోపణ కాదు. అటువంటి ప్రబుద్ధుల చేతికి పార్కును అప్పచెప్పడం - పెనం నుంచి పొయ్యిలోకి పడత్రోయడమే.

పార్కు నిర్వహణకు మునిసిపాలిటీ కాని, టూరిజం శాఖ కాని తన సొమ్ము వ్యయం చేయవల్సిన అవసరం లేదు. పార్కు చూడడానికి వచ్చిన వారి నుంచి దండే ప్రవేశ రుసుం, లోపల వున్న క్యాంటిన్, స్కేటింగ్ రింగ్, మ్యూజికల్ ఫౌంటెన్ వంటి ప్రత్యేక వసతుల ద్వారా లభించే డబ్బుతో పార్కును అద్భుతంగా నిర్వహించ వచ్చు. టూరిజం శాఖకు అప్పచెప్తే - ఎండోమెంట్ శాఖ చేతిలో పడిన నెల్లూరు రాజరాజేశ్వరి దేవస్థానం వలె అన్యాయమై పోతుంది. కలెక్టర్ గారు ఆలోచించవల్సిన విషయం ఇది. ఇటువంటి నిర్ణయాలు తాను ఒక్కటిగా, నిరంకుశంగా తీసుకోవడం ఆమెకు మంచి కాదు. పదిమందితో మాట్లాడి, నలుగురు సలహాలు తీసుకొని వ్యవహరిస్తే ఆమెకు కూడా గౌరవం పెరుగుతుంది కదా?

మునిసిపల్ ఆస్తులు, ప్రభుత్వ రంగ సంస్థలకు అప్పచెప్పడానికి చట్టం ఒప్పుకుంటుందా? ఆత్మకూరు బస్‌స్టాండ్, కూరగాయల మార్కెట్ వంటి స్థలాల విషయంలో అనుసరించిన పద్ధతే దీనికి పాటించడం అవసరం కాదా? చట్టానికి వ్యతిరేకంగా ఎందుకు ప్రవర్తించ వలసి వస్తున్నది?

ఇంకా విచిత్రమేమిటంటే - టూరిజం శాఖ ఉన్నతాధికారి ఒకరు, అసలు నెల్లూరులో ఒక పార్కు కట్టినట్లు, అది తమ శాఖకు బదలీ చేసినట్లు తనకు తెలియనే తెలియదని, తమ ఆఫీసుకు అటువంటి ప్రతిపాదనే రాలేదని చెప్పారు. ఏమిటీ గందరగోళం?

పార్కు సక్రమ నిర్వహణే అందరి లక్ష్యమైతే నాదొక సలహా - దీని కోసం పేరు వూరు లేకుండా అరకోటి ఖర్చు పెట్టిన జి.ఎస్.రెడ్డికే నిర్వహణ బాధ్యత అప్పచెప్పి చూడడం మంచిది. స్థలం పైనా, అందులోని ఆస్తులపైనా ఎప్పటికీ యాజమాన్యం లభించని రీతిలో ఒక ఒప్పందం చేసి, నిర్వహణను అటువంటి వారికి అప్పచెప్తే పార్కు బాగుపడుతుంది; మునిసిపాలిటీకి కూడా అదనపు ఆదాయం వస్తుంది.*

## ఆనం షాక్

4వ పేజీ కొరవ

విద్యుత్ ఛార్జీలు ఎక్కడనుంచి కట్టాలని తీవ్ర స్వరంతో ప్రశ్నించింది. ట్రాన్స్‌కో అధికారులు గోబ్యాక్ అంటూ మహిళలు నినదించేసరికి బతుకుజీవుడా అంటూ అక్కడ నుంచి బయలు దేరి వెళ్లిపోయారు.

20తేది పొట్టెపాళెంలో గ్రామసభకు బయలుదేరిన నోడల్ అధికారి సురేంద్రబాబును, అగ్రికల్చర్ అధికారి వెంకటసుబ్బయ్యను, ఎమ్మెల్సీ బ్రదర్స్ వివేకానందరెడ్డి, రామనారాయణ రెడ్డిల నేతృత్వంలో రోడ్డుపై అడ్డగించారు. వివేకానందరెడ్డి మాట్లాడుతూ కరెంటు ఛార్జీలను దారుణంగా పెంచి పేద, మధ్యతరగతి ప్రజల బ్రతుకులను ప్రశ్నార్థకం చేసారు. రైతన్నను కరవు కోతకు గురిచేసారు. తమిళనాడులో యూనిట్ కరెంటుకు 60 పైసలకిస్తుంటే ఇక్కడ 1.35పైసలకు ఇవ్వడానికి గల కారణాలను అధికారులు వివరించమనగా, వాళ్లు తెల్లమొహాలేసారు. రామనారాయణరెడ్డి మాట్లాడుతూ అక్రమ కనెక్షన్లు అరికట్టడానికి గ్రామసభలు నిర్వహిస్తున్నామని అంటున్నారు. అసలు కనెక్షన్‌లే లేనప్పుడు అక్రమకనెక్షన్లు ఎక్కడ నుంచి వస్తాయన్నారు. విద్యుత్ కనెక్షన్ల కోసం పెట్టుకొన్న వేల అర్జీల సంగతేమిట న్నారు. పొట్టెపాళెం, కొమ్మలపూడి, దేవరపాళెం నుండి వచ్చిన ప్రజలు 'ఆఫీసర్స్ గోబ్యాక్'అని నినదించడంతో అధికారులు తోక ముడవక తప్పలేదు. ఈ కార్యక్రమంలో నెల్లూరు రూరల్ మాజీ జడ్పీటిసి సభ్యుడు హంసకుమార్‌రెడ్డి, వడ్లపాళెం, దేవరపాళెం, ములుమూడి సర్పంచ్‌లు శ్రీనివాసులురెడ్డి ఏమాలకొండయ్య, మహబూబ్‌బాషా పాల్గొన్నారు. 20తేది టౌన్ లోని 39వార్డులోని కృష్ణమందిరం వద్ద జరిగిన సభను మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందాని బాషా నేతృత్వంలో, సింహపురి కాలనీలో పేరూరి నరసింహాలు శెట్టి నాయకత్వాన ప్రజలు బహిష్కరించారు. 21తేది 13వ వార్డులోని వేణుగోపాలస్వామి ప్రాథమిక పాఠశాలలో జరిగిన విద్యుత్ వినియోగదారుల సదస్సును ఎమ్మెల్సీ వివేకానందరెడ్డి వామపక్ష కార్యకర్తలు కలసి అడ్డుకున్నారు.

## ఆటల పోటీ

4వ పేజీ కొరవ

ప్రభుత్వ, పత్రికా యంత్రాంగాల మధ్య ఇటువంటి క్రీడలు జరుగుతుంటే ఇద్దరి మధ్య సుహృద్భావ వాతావరణం నెలకొంటుంది. త్వరలో జర్నలిస్టులు, రెవెన్యూ సిబ్బంది మధ్య సాంస్కృతిక పోటీలు నిర్వహించేందుకు కృషి చేస్తున్నామన్నారు. పోలీసులు - జర్నలిస్టులు వెరి రెండు ఆటల్లో గెలుస్తారని తనకు ఒక రోజు ముందే తెలిసిందని ఈ వ్యవహారంలో మ్యాచ్ ఫిక్సింగ్‌లు జరిగాయని కలెక్టర్ చమత్కరించారు. ఎస్పీ రవికుమార్ మూర్తి, జర్నలిస్టు యూనియన్ నాయకులు అంజనేయులు, రహీం, చంద్రమోహన్, జయప్రకాష్ వేదికపై ఆసీనులయ్యారు. క్రీడోత్సవం విజయవంత మవ్వడానికిరాష్ట్ర పోలీసు అధికారుల సంఘం కార్యదర్శి విజయభాస్కర్ రెడ్డి చాలా కష్టపడ్డారు.

## కౌన్సిల్

4వ పేజీ కొరవ

సందానీబాషాను నెత్తిన పెట్టుకొని మోసిన పాపాన్ని కో ఆప్షన్ ఎన్నికల సాకుతో తుడిచేసు కోవాలని తంటాలు పడ్డాడు. తన భార్య అనూరాధ, ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహన్, ఎంపి. రాజేశ్వరమ్మతో సహా ఐదురుగు కౌన్సిలర్ల చేత కాంగ్రెస్ అభ్యర్థి సందానీబాషాకు ఓటు వేయించి భ్రష్టుపట్టిన రమేష్‌రెడ్డి తాజాగా మంత్రి వర్గీయులను ఇరుకున పెట్టాలని పాత ఒప్పందానికి తెరకాను పెట్టాడు. కో ఆప్షన్ సభ్యుల ఎన్నిక ఏకగ్రీవం కావాలంటే, కాంగ్రెస్ కౌన్సిలర్లు మంత్రి వర్గీయులను కాకుండా తనతో నేరుగా చర్చలు జరిపితే అంగీకరిస్తానని కబురు పంపాడు. రమేష్‌తో చర్చలకు కాంగ్రెస్ నిరాకరించడంతో మంత్రి వర్గీయులు చేసుకొన్న ఒప్పందాన్ని తాను అంగీకరించనని మొండికేశాడు. మున్సిపల్ రాజకీయాల్లో మంత్రి చెయి పెడితే ఆ చేతిని నరికి వేస్తానని కూడా హెచ్చరికలు జారీ చేశాడు. కోఆప్షన్ స్థానానికి కాంగ్రెస్‌తమ అభ్యర్థిగా వాట్ల నరసింహారావును ప్రకటించడంతో 27, 28 వార్డుల కౌన్సిలర్లను రెచ్చగొట్టి మంత్రి శిబిరం నుండి తనవైపుకు తిప్పుకున్నాడు. 'ఆనం' వ్యతిరేక సిద్ధాంతంతో 12వార్డు కౌన్సిలర్ శ్రీనివాసులురెడ్డిని కూడా బుట్టలో వేసుకున్నాడు. పనిలో పనిగా సర్వేపల్లి శకుని మామ సోమిరెడ్డి దర్శకత్వంలో, వ్యూహారచన చేశాడు. కో ఆప్షన్ సభ్యుల ఎన్నికలో నెల్లూరులో మంత్రి వర్గీయులు, కాంగ్రెస్ పార్టీతో మిలాఖత్ అయ్యారని, పార్టీ అధిష్టాన వర్గానికి ఫిర్యాదు పంపించాడు. ఇందులో 11 మంది కౌన్సిలర్ల చేత సంతకాలు కూడా చేయించాడు. అయితే, రమేష్ రెడ్డి విషయం తెలిసిన పార్టీ నాయకత్వం దీన్ని చెత్తబుట్టదాఖలు చేయడంతో, కో ఆప్షన్ ఎన్నిక కార్యక్రమాన్ని రొమ్చుచేసి పార్టీ పరువును పెన్నలో కలిపేశాడు. ఈ ఎన్నిక విషయంలో పట్టుదల వీడి, మంత్రి ఆదాలతో మాట్లాడి, సమస్యను సామరస్యంగా పరిష్కరించుకోవలసిందిగా కొందరు మధ్యవర్తులు ఛైర్‌పర్సన్ అనూరాధకు, రమేష్‌రెడ్డికి సూచించినా, తాము ఆదాలను మంత్రిగా గుర్తించడం లేదని నిష్కర్షగా చెప్పేశాడు. దీంతో ఇరు వర్గాల మధ్య ప్రతిష్ఠంబన నెలకొని మొత్తం ఎన్నిక కార్యక్రమమే వాయిదా పడిపోయింది.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

అంటూ కాబోయే అల్లుడు ప్రదీప్, కూతురు ప్రియ, హరిశ్చంద్రరావును విచారించటం అవసరం కదా?

కథ వినేందుకు కొంత గందరగోళంగా వున్నా కథనం పట్టుగా, సరళంగా సాగుతుంది. దర్శకుడు నేర్పుగా వ్రాసుకున్న స్క్రీన్‌ప్లే కథాగమనం, ఆసక్తికరంగా సాగేందుకు దోహదపడింది. కుటుంబ విషయాన్నే కాక ఇతర కుటుంబ, సాంఘిక విషయాలను కూడా దర్శకుడు కథ గమనానికి జోడించి, ప్రేక్షకులను అలరించి ఆకట్టుకున్నాడు. అన్నా చెల్లెళ్ళ సెంటిమెంటును బలే పేతం చేశాడు.

మరుధూరి రాజా సంభాషణలు ఛలోక్తులతో సొంపుగా, ఇంపుగా కుదిరాయి. శ్యాం.కె.నాయుడు ఛాయాగ్రహణం సాంకేతిక నైపుణ్యాన్ని ప్రదర్శించింది. దేవా సంగీతం కమ్మదనాన్ని అందించింది.

సురేష్, నవీన్, ప్రియాగిల్, దుర్గ ప్రేమ జంటలుగా, అన్నా, చెల్లెళ్ల సెంటిమెంటు గిరిబాబు, యమున, కల్పనల నటన మెప్పుకోతగింది.

సినిమా చూచేందుకు వచ్చే ప్రేక్షకులను "బాగున్నారా" అంటూ కుశల ప్రశ్నలతో ఆహ్వానిస్తు వుంది "బాగున్నారా" సినిమా

## సినిమా

9వ పేజీ కొరవ

విచ్చేసిన పవన్ కళ్యాణ్ గొప్ప తనాన్ని వివరించారు. ఇటీవల పవన్ కళ్యాణ్ నటించిన ఒక చిత్రానికి పాట రాయాల్సి వచ్చింది. అది ప్రేమగీతం. పాట సందర్భాన్ని పవన్ ముందుగా చెప్పారు. ఆయన విదేశాల్లో ఉండగా ఆ పాట రాసి యూనిట్ వాళ్లకు ఇచ్చాను. నాకు బాగా నచ్చిన పాట అది. కాని యూనిట్‌వాళ్లు మీరు వ్రాసిన పాట హీరో గారికి నచ్చలేదని చెప్పారు. ఆ మాట విన్నాక బాధపడ్డాను. ఆ పాటలో ప్రేమ తాలుకు ఫిలాసఫీ మొత్తం రాసాను. అయినా ఎందుకు నచ్చలేదో నాకు అర్థం కాలేదు. పవన్ విదేశాల నుంచి తిరిగి వచ్చాక ఆయన్ను కలిశాను. పాట గూర్చి పవన్ చెబుతూ మీరు వ్రాసిన పాట చదివాక నా భావాలను స్పష్టంగా మీకు చెప్పలేక పోయానేమో అనుకొన్నాను. పాట బావుంది. అయితే కర్మ స్వేచ్ఛ తాలుకు భావం పాటలో కనిపించ లేదన్నారు. నేను కొద్దిసేపు సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాను. ఈ సినిమా రంగంలో 'కర్మస్వేచ్ఛ' లాంటి పదాలను నాలాంటి వాళ్లే వాడగలరన్న అహంనాలో వుండేది. పవన్‌లోని తాత్వికత నాకళ్లు తెరిపించింది. వళ్లు దగ్గరపెట్టుకొని పాటలు వ్రాయాలన్న బాధ్యతను మరింత పెంచిందన్నారు.

## నెల్లూరుసంగతులు

2వ పేజీ కొరవ

4, 5, 18, 18, 21, 29, 29, 49, 95 ర్యాంకులు రావడం ఆనందకరం. అదే విధంగా ఇంటర్‌లో బైపిసిలో 1,2,9 ఎంపిసిలో 2,3 ర్యాంకులు, ఎపిఆర్‌జెసిలో 1, 1, 3, 3, 6, 7 ర్యాంకులు తెచ్చుకొన్నట్లు వివరించారు. మెడికల్‌లో రాష్ట్రస్థాయిలోనాల్గవ ర్యాంకు తెచ్చుకొన్న డి.ప్రణీతకు కెవి రత్నం బంగారు బ్రాస్‌లెట్ బహుకరించారు. ఐదవర్యాంకు తెచ్చుకొన్న కెరుశురామ్‌కు కొర, 29వర్యాంకర్ శ్వేతారెడ్డికి శ్రీమతి పద్మావతి రత్నం, ఇంటర్ బైపిసిలో స్టేట్ ర్యాంకర్ ఎస్.మహమ్మద్ ఆలీకి కోచింగ్ సెంటర్ డైరక్టర్ వేణుగోపాల్, మిగతా ర్యాంకర్లకు టౌన్‌లోని పలువురు డాక్టర్లు ప్రోత్సాహక బహుమతులందించారు.



వెంకటగిరి మండలం చెలికంపాడులో జరిగిన విద్యుత్ సదస్సులో అధికారులను నిలదీస్తున్న ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ, కూర్చొన్నవారిలో చెలికం శంకరరెడ్డి, కడప బ్రహ్మయ్య వున్నారు.

### రామనారాయణరెడ్డిపై కేసు

రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డిపై నెల్లూరు రూరల్ పోలీసులు కేసు నమోదు చేశారు. విద్యుత్ శాఖకు చెందిన జీపు ధ్వంసం, రికార్డులు తగలబెట్టడం, అధికారుల విధి నిర్వహణను అడ్డుకోవడం తదితర అభియోగాలను మోపారు. ఆయన నియోజక వర్గంలోని ఉప్పుటూరు గ్రామంలో ఈ సంఘటనలు జరిగాయి. రామనారాయణరెడ్డి తోపాటు, మాజీ సమితి అధ్యక్షుడు కాసాని రమణారెడ్డితో సహా మరో 20 మందిని కూడా కేసులో నిందితుల్ని చేశారు.

జిల్లాలో విద్యుత్ ఛార్జీల పెంపునకు వ్యతిరేకంగా ఉద్యమం చేస్తున్నవారిలో రామనారాయణరెడ్డి హైలెట్ - ప్రతిగా... ఆయన కాలికి బలపం కట్టుకొని తిరిగి ప్రజానిరసనను ఉద్యమరూపంలో మలిచారు. మనుబోలు గ్రామంలో అధికారులను అడ్డుకొని వారిని ఆరు కిలోమీటర్ల దూరం నడిపించి, తానూ వారితో పాటే ప్రయాణించారు.

ఒక్కోరోజు ఒక్కో రకమైన వినూత్న నిరసనల ఉద్యమాన్ని రక్తికట్టించి, కేసుల్లో ఇరుక్కున్నా, లెక్క చేయకుండా ముందుకు సాగుతున్నాడు. రామనారాయణరెడ్డికి రాజకీయాల్లో పెద్దమనిషన్న పేరుంది.

***

రామనారాయణరెడ్డిపై పెట్టిన తప్పుడు కేసును ఉపసంహరించాలని కాంగ్రెస్ కార్యకర్తలు 23తేదీ రూరల్ పోలీస్ స్టేషన్‌ను ముట్టడించి, సిఐ లక్ష్మణరావు, ఎస్‌ఐ జానకిరాంను తమ ప్రశ్నలతో ఉక్కిరి, బిక్కిరి చేశారు. కేసులో రామనారాయణరెడ్డికి ఎటువంటి సంబంధంలేదని ప్రకటించే వరకు బయటకు కదలమని భీష్మించి కూర్చోవడంతో, ఎస్‌ఐ, రామనారాయణరెడ్డి ఈ వ్యవహారంలో ఎటువంటి ప్రమేయం లేదని తన దర్యాప్తులో తేలినట్లు ప్రకటించారు. ఈ నిరసనకు ఎమ్మెల్యేలు కన్నా లక్ష్మీనారాయణ, వివేకానంద రెడ్డి, రామనారాయణరెడ్డి, సిపి. శేషారెడ్డి నాయకత్వం వహించారు.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zamin Ryot Press, Nellore.